# శ్రీ గురుతత్త్వము

స్వామి పరమానందనాథ
(డా|| క్రోవి పార్థసారథి)



శివకామేశ్వరి గ్రంథమాల
విజయవాడ - 13

# శ్రీ గురుతత్త్వము

స్వామి పరమానందనాథ
(డా॥ క్రోవి పార్థసారథి)

ప్రకాశకులు :

**శివకామేశ్వరి గ్రంథమాల**

41-22/4-36, భ్రమరాంబాపురం, కృష్ణలంక,
విజయవాడ - 520 013. ఫోన్ : 0866-2522824

# శ్రీ గురుతత్త్వము

స్వామి పరమానందనాథ
(డా॥ క్రోవి పార్థసారథి)

ముద్రణ : నవంబరు, 2007



కాపీలు : 1000

**వెల : రూ. 30-00**

ప్రతులకు :

**శివకామేశ్వరి గ్రంథమాల**

41-22/4-36, భ్రమరాంబాపురం,
కృష్ణలంక, విజయవాడ - 520 013.
ఫోన్ : 0866-2522824

**శివకామేశ్వరి ఆర్ష గ్రంథమాల**

27-18-59, కాంగ్రెస్ ఆఫీస్ ఎదుట,
కాంగ్రెస్ ఆఫీస్ రోడ్, గవర్నర్‌పేట,
విజయవాడ - 520 002.
ఫోన్ : 0866-6661777

ముద్రణ :
లక్ష్మీ వైభవ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ-3.



శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి
ఈ గ్రంథము అంకితము ఇవ్వబడినది.



డా॥ క్రోవి పార్థసారథిగారిని మైసూర్ దత్తపీఠ ఆస్థాన విద్వాంసునిగా నియమిస్తున్న పూజ్యశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ, గుజరాత్ రాష్ట్ర గవర్నర్ గౌ॥ శ్రీ నావల్ కిషోర్ శర్మ, కర్నాటక రాష్ట్ర గవర్నరు గౌ॥ శ్రీ టి.ఎన్. చతుర్వేది, 29-5-2005

## ప్రణతులు

అజ్ఞానము అనే అంధకారం నుంచి రక్షించి జ్ఞానజ్యోతులు వెలిగించేవాడే గురువు. అతడు త్రిమూర్తి స్వరూపుడు. సాక్షాత్తు పరమేశ్వరుడు. శిష్యుడికి ఉపదేశం చేసి, సాధనా మార్గం చెప్పి, జీవాత్మ, పరమాత్మ రెండూ ఒక్కటే అనే విషయాన్ని అనుభవ పూర్వకంగా తెలియజేసేవాడే గురువు.

గురువుకు కులము, మతము, జాతి అనేవి లేవు. స్త్రీ పురుష నపుంసక భేదాలు అసలే లేవు. గురువుకన్న ఎక్కువైన తత్త్వము లేదు, గురువును మించిన తపస్సు లేదు. గురువును ధిక్కరించి ఏ మంత్రాన్ని అనుష్ఠానం చేసినా, ఎన్ని యుగాలు తపస్సు చేసినా ఉపయోగం లేదు. భగవంతుడికి కోపం వస్తే గురువు రక్షిస్తాడు. కాని గురువు గనక కోపిస్తే రక్షించేవారు లేరు. ఈ విషయాన్ని తెలుసుకుని మానవుడు సద్గురువును ఆశ్రయించాలి. సద్గురువు లభించటమనేది పూర్వజన్మ పుణ్యఫలాన్ని బట్టి జరుగుతుంది. పరిపక్వత చెందిన శిష్యుడి కోసం గురువే వెతుక్కుంటూ వస్తాడు. గురువు మనమధ్యనే ఉండే పరమేశ్వరుడు. సామాన్యుల దృష్టిలో అతడు ఒక మానవుడు. జ్ఞాని దృష్టిలో ఆయన పరమేశ్వరుడు. అందుకే గురువుగారిని చూడగానే ముందుగా సాష్టాంగదండ ప్రణామం చెయ్యాలి. ఆయనతోపాటు సమానమైన ఆసనంమీద కూర్చోరాదు. ఆయన తినకుండ మనం తినరాదు. ఎట్టి పరిస్థితులలోను గురునింద చేయరాదు. ఆయన చెయ్యమన్న పని చెయ్యాలి. ఆయన చెబితే వినాలి. లేకపోతే అడగకూడదు. గురువు తనకు తెలిసినవాడైనా, సన్నిహితుడైనా, తన సోదరుడైనా సరే ఆయన్ని గౌరవించాలి. ఆయన మీద అపారమైన నమ్మకం ఉంచాలి. తాను పండితుడైనంత మాత్రాన 'గురువుకు ఏమీ తెలియదు.' అనే భావన పనికిరాదు. గురువు మహాజ్ఞాని. ఆయనకు భూతభవిష్యద్వర్తమానాలన్నీ తెలుసు. ఈ మాట మర్చిపోరాదు. ఒకవేళ గురువుగారి నోటినుంచి పొల్లు మాట వచ్చినా 'అది జరిగి తీరుతుంది' అని గుర్తుంచుకోవాలి.

గురువు అంటే సామాన్యమైనవాడు కాదు. సాక్షాత్తు పరమేశ్వరుడు. ఆయన కృపాకటాక్ష వీక్షణాలుంటే దేన్నైనా సాధించవచ్చు. అందుకే బలమైన శరీరము, అందమైన రూపము, మంచి భార్య, అపరిమితమైన

ధనము, కీర్తి, ప్రతిష్ఠ, పాండిత్యం, కవిత్వం అన్నీ ఉన్నాయి. దేశవిదేశాలలో పేరు ప్రఖ్యాతులున్నాయి. ఎన్నో దానధర్మాలు చేశాడు. అయినప్పటికీ గురువు యొక్క కృపాకటాక్ష వీక్షణాలు లేకపోయినట్లైతే అతని జన్మ వ్యర్థము. అటువంటి మహానుభావుడు గురువు. కాబట్టి గురువును సేవించాలి, ఆరాధించాలి. తన జీవితాన్నే నివేదనగా అర్పించాలి. 'నేను జీవుణ్ణి' అనే భావన ఆయనకు వదలి, 'నేను సచ్చిదానందమూర్తిని' అనే స్థితిలో ఉండాలి. ఇది పరిపూర్ణమైన నివేదన. ఈ రకంగా గురువును ఆరాధించిన వాడు జన్మరాహిత్యం పొందుతాడు. ఇదే గురుతత్త్వము. ఇది తెలుసుకుని గురువును సేవించినవాడు కృతకృత్యుడౌతాడు.

గురుతత్త్వాన్ని పుస్తక రూపంలో ప్రచురించటమే కాక పదహారు గంటలపాటు ఉపన్యాసాలు చెప్పి సిడిగా కూడా విడుదల చేయటం జరిగింది. పరిమాణంలో చిన్నదైనా విషయ పరిజ్ఞానంలో అనంతమైన ఈ చిన్ని గ్రంథాన్ని సాధకులు సద్వినియోగం చేసుకుంటారని భావిస్తూ...

గతంలో నేను వ్రాసిన గ్రంథాలలాగానే దీన్ని కూడా ఆదరిస్తారని ఆకాంక్షిస్తూ, ఏమీ తెలియని నేను ఈ గ్రంథాన్ని వ్రాసినందుకు సాధకులు, పండితులు, విజ్ఞులు, ప్రాజ్ఞులు నన్ను మన్నించి ఆశీర్వదిస్తారని తలుస్తూ, ఈ గ్రంథాన్ని అవధూత, దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి అంకితం చేస్తూ .....

భవదీయుడు

క్రోవి పార్థసారథి

సర్వజిత్ నామ సంవత్సర కార్తీక పూర్ణిమ

24-11-2007, శనివారం

## విషయసూచిక

శ్రీరస్తు                                                    శుభమస్తు

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ గురుతత్త్వము

## 1. గురువు

అసలు 'గురువు' అంటే ఎవరు ?

**'గ'కారో అంధకారశ్చ 'రు' కారశ్చ తన్నిరోధకః**

గకారము అంటే అంధకారము. అసలు అంధకారము అంటే ఏమిటి ? అంధకారము అంటే చీకటి, భ్రాంతి, అజ్ఞానము అని అర్థం. అంధుడిగా చేయటము అంటే అక్కడ ఉన్నటువంటి దాన్ని తెలుసుకోనీయక పోవటము. ఒక గదిలో ఉన్నాం. ఆ గది నిండా వస్తువులున్నాయి. రాత్రిపూట. క్రొత్తచోటు మనకు పరిచయం లేనటువంటి ప్రదేశం, ఉన్నట్టుండి ఒక్కసారిగా కరంటు పోయింది. అంతా చీకటిమయం. ఇప్పుడు ఆ గదిలో ఎక్కడ ఏ వస్తువు వున్నదో తెలియదు. మనకి కళ్ళున్నాయి. చూడగలం. కాని ఈ చీకటి మనకళ్ళను కప్పివేసింది. చూపును నిలిపి వేసింది. కంటికి ఏ వస్తువూ కనిపించదు. అటువంటి సమయంలో ఎవరో వచ్చి దీపం వెలిగించారు. గది అంతా వెలుతురు ఆవరించింది. ఆ వెలుతురులో మనం అన్నింటినీ చూడగలం. అన్ని వైపులకూ మన దృష్టిని ప్రసరించగలం. ఈ రకంగా అంధకారంలో పడి కొట్టుమిట్టాడుతున్న వారికి కాంతిని ప్రసరింపజేసి, మార్గాన్ని చూపేవాడే గురువు.

మరి భ్రాంతి అంటే ఏమిటి ? ఒకదాన్ని చూపి వేరొకటి అనుకోవటం, తప్పుడు అభిప్రాయం కలిగి ఉండటము, చూసిన దాన్ని సరిగా అర్థం చేసుకోలేక, గుర్తు పట్టలేక, అది వేరొక వస్తువు అనుకోవటం. ఉదాహరణకు **రజ్జు సర్పభ్రాంతి.** చీకట్లో 'తాడు'ను చూసి 'పాము' అనుకోవటం.

ఒక వస్తువును చూసి అది సరి అయినది అని మనం తెలుసుకోలేనప్పుడు, ఆ వస్తువు యొక్క నిజస్వరూపాన్ని మనం గుర్తించలేనప్పుడు, ఎవరో ఒక వ్యక్తి వచ్చి, ఆ వస్తువుయొక్క యదార్ధస్థితి గురించి మనకి తెలియజేశారు. అప్పుడు ఆ వస్తువు యొక్క అసలు రూపం మనకి తెలుస్తుంది. అది పాము కాదు త్రాడు అని చెప్పారు. ఇంకా మనకి భయం పోలేదు. దీపపు వెలుగులో అది త్రాడు అని చూపించారు. కర్రతో కదిపి చూపించారు. అది కదల్లేదు. పాము కాదు. త్రాడే. ఇలా విషయాన్ని మనకి వివరించి చెప్పేవాడే గురువు. అలాగే ముత్యపుచిప్పను చూసి వెండిపాత్ర అని భ్రమపడతాం. చీకట్లో పెద్దరాతిని చూసి మనిషి అని భ్రమ పడతాం. ఇవన్నీ నిజం కాదు అనే విషయం మనకి తెలియదు. ఎడారిలో ప్రయాణం చేస్తున్నాం. ఎండ బాగా ఉన్నది. క్రింద ఇసుక కూడా వేడెక్కింది. ఆ వేడిని భరించలేకపోతున్నాం. దాహం వేస్తోంది. నాలుక పిడచ కట్టుకుపోతోంది. ఇంతలో దూరంగా నీటిగుంటలు కనిపించాయి. ఎడారి ప్రాంతం మనకి పరిచయం లేదు. అందుచేత అవి నిజమైన నీటిగుంటలు అనుకున్నాం. అటువేపుగా సాగిపోతున్నాం. ఎంత దూరం వెళ్ళినా, మనకు ఆ నీటిగుంటలకు మధ్య ఉన్న దూరం తగ్గదు. అలానే ఉన్నది. అలా ప్రయాణం చేసి చేసి, అలసిపోయి, చివరకు చచ్చిపోతాం. అటువంటి సమయంలో ఎవరైనా వచ్చి అవి ఎండమావులు. నీటిగుంటలు కావు అనే యదార్ధాన్ని మనకి తెలియజేసినట్లైతే, మనయొక్క భ్రాంతి, భ్రమ కాస్తా వదిలిపోతుంది. ఎండమావులలో నీటిని వెతుక్కునే ప్రయత్నాన్ని మానేస్తాం. ఈ రకంగా మన భ్రాంతిని తొలగింపజేసి, యదార్ధాన్ని వివరించేవాడే గురువు.

అజ్ఞానము అంటే జ్ఞానము లేకపోవటము. జ్ఞానము అనేది రెండు రకాలు.

**1. లౌకిక జ్ఞానము.** దీన్నే విషయ పరిజ్ఞానము అంటారు. ఈ జగత్తులో ఏ వస్తువు వల్ల ఏ రకమైన ఉపయోగం ఉన్నదనే విషయం తెలుసుకోవటం. నిత్యజీవితంలో ఉపయోగించే వస్తువులు, కంటికి కనిపించే ఇతర వస్తువుల వల్ల ఉపయోగాలు, వాటిని గురించిన విషయ పరిజ్ఞానము. ఇది ఈ లోకంలో సుఖంగా జీవించటానికి ఉపయోగిస్తుంది. ఈ పరిజ్ఞానం వల్ల మానవుడు ధనము, అధికారము పొందగలుగుతాడు.

**2. పారమార్ధికజ్ఞానము** ఈ చరాచర జగత్తు అంతా ఏవిధంగా ఆవిర్భవించింది? సృష్టి జరగటానికి ముందు ఈ జగత్తు ఏ రకంగా ఉండేది? అసలు సృష్టి ఏ

రకంగా జరిగింది? ఈ జగత్తులో మానవుడు ఏ రకంగా ఆవిర్భవించాడు? ఈ మానవుడు మరణానంతరము ఏమవుతాడు? పరమేశ్వరుడు అంటే ఎవరు? ఆయన ఎక్కడ ఉంటాడు? ఎలా ఉంటాడు? జీవాత్మ, పరమాత్మల మధ్య తేడా ఏమిటి? ఈ జీవాత్మ పరమాత్మలో ఏ విధంగా లీనమవుతుంది? మోక్షం అంటే ఏమిటి? అది ఎలా ప్రాప్తిస్తుంది? మొదలైన ప్రశ్నలకు సమాధానమే జ్ఞానము. సత్యము, నిత్యము, శాశ్వతము అయిన వస్తువును గురించి తెలుసుకోవటమే జ్ఞానము.

సత్యము అంటే నిజము, యదార్థము, ప్రత్యక్షమైన నిజము, రుజువు చేయబడిన నిజము. ఈ జగత్తులో సత్యమయినది అంటే నిజమైనది ఏదంటే పరమాత్మ. అతడే పరమేశ్వరుడు. ఆకారము లేనివాడు, గుణములులేనివాడు, రూపంలేనివాడు. సర్వ కాల సర్వావస్థలయందు ఉండేవాడు. ఈశ్వరులకే ఈశ్వరుడు. అతడే పరమేశ్వరుడు.

నిత్యము అంటే ఎడతెగనిది, పతనము కానిది, ఉత్పత్తి నాశనములు లేనిది, కాలత్రయమందు ఉండేది, అదే పరమాత్మ. పరమేశ్వరుడు ఆది అనాది అయినవాడు. ఈ జగత్తుయొక్క సృష్టి ప్రారంభం కాక ముందు నుంచీ ఉన్నటువంటివాడు. జగత్తుకు మూలాధారమైనవాడు. అంటే భూత భవిష్యద్వర్తమానాలలో ఉంటాడు. అతడికి జన్మమృత్యుజరాదులు లేవు. ఉత్పత్తి నాశనములు లేనివాడు. జగత్తు యొక్క సృష్టికి మూలాధారమైనవాడు. అతడే పరమేశ్వరుడు.

శాశ్వతము అంటే ఎప్పటికీ ఉండేది. నాశనము కానిది. అదే పరమేశ్వర స్వరూపము. పరమేశ్వరుడు సర్వకాల సర్వావస్థలయందు ఉంటాడు. గతంలో ఉన్నాడు. ఇప్పుడున్నాడు. ఇకముందుకూడా ఉంటాడు. అతడికి జనన మరణాలుండవు. సుఖ దుఃఖాలు ఉండవు. అతడే పరమేశ్వరుడు.

ఈ రకంగా సత్యము, నిత్యము, శాశ్వతము అనేవి పరమేశ్వరుని లక్షణాలు. అటువంటి పరమేశ్వరుని గురించి తెలుసుకోవటమే జ్ఞానము. అటువంటి జ్ఞానాన్ని మనకు అందించేవాడు 'గురువు'.

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః ॥**

ఆ గురువు బ్రహ్మదేవునితో సమానుడు. బ్రహ్మ అంటే ప్రజాపతి. సృష్టికర్త. రజోగుణప్రధానుడు. ఆ గురువు విష్ణుస్వరూపుడు. అంటే స్థితికారకుడు. సత్వగుణ

ప్రధానుడు. ఆ గురువు రుద్రరూపుడు. అతడే ఈశ్వరుడు. తమోగుణ ప్రధానుడు. అంటే గురువు త్రిమూర్తి స్వరూపుడు. సృష్టి స్థితి లయకారకుడు. త్రిగుణసంపన్నుడు. అటువంటి గురువు త్రిమూర్తి స్వరూపుడే కాదు. ఆ త్రిమూర్తులకన్న కూడా ఎక్కువైనవాడు. సాక్షాత్తు పరమేశ్వర స్వరూపుడు. పరమేశ్వరుడు అంటే సచ్చిదానంద స్వరూపుడు అన్నమాట. ఇక్కడ 'సచ్చిదానందము' అంటే ఏమిటో ఒకసారి చూద్దాం. సత్ అంటే సత్యమైనది అని అర్థం. అంటే గురువు సత్యమైనవాడు. సర్వకాల సర్వావస్థల యందు ఉండేవాడు. భూత భవిష్యద్వర్తమానాలలో ఉండేవాడు. సత్యము, నిత్యము, శాశ్వతము అయినవాడు. ఇక్కడ 'సత్యము' అనే పదాన్ని గతంలో చూశాం. ఇక రెండవది 'చిత్తు' అంటే జ్ఞానము, చైతన్యము, జ్ఞానరూపమైన ఆత్మ అని అర్థం. గురువు జ్ఞానరూపుడు. ఇక జ్ఞానము అంటే వస్తు జ్ఞానము, విషయ పరిజ్ఞానము కాదు. పారమార్థిక జ్ఞానము. చరాచర జగత్తంతా పరమేశ్వరుని నుంచే ఆవిర్భవించి మళ్ళీ పరమేశ్వరుని యందే లీనమవుతున్నది. ఈ జగత్తుకు కర్త, భోక్త రెండూ అతడే. అతడు నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు, త్రిగుణాతీతుడు, ఆదిమధ్యాంత రహితుడు, నిరంజనుడు, నిర్మలుడు, నిత్యుడు, నిష్కలుడు, నిష్కాముడు, నిత్యముక్తుడు, చిదానందుడు. అతడు ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతము అతడే నిండిఉన్నాడు. ఎనుబదినాలుగు లక్షల జీవరాసి ఆతని యొక్క రూపమే స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తులో ప్రాణమున్నవి, ప్రాణము లేనివి, చలనమున్నవి, చలనము లేనివి అన్నీ ఆ పరబ్రహ్మయొక్క రూపాలే. సృష్టికి ముందు ఒంటరిగా ఈ జగత్తంతా ఆవరించి ఉంటాడు. సృష్టి జరిగిన తరువాత నామరూపాత్మకమైన ఈ జగత్తులో వివిధ రకాల వస్తువుల, జీవుల రూపంగా విస్తరించి ఉంటాడు. ఈ జగత్తులో నదీనదాలు, అడవులు, కొండలు, బండలు, పర్వతాలు, సముద్రాలు, లోయలు, నేల, నింగి, ఆకాశం, నిప్పు, గాలి, చెట్లు చేమలు, ఆకులు అలములు చీకటి వెలుగులు, పగలు రాత్రి, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, గ్రహాలు, ఒకటేమిటి కంటికి కనిపించేవి, కనిపించనివి అన్ని రూపాలతోను ఈ జగత్తును ఆ పరమేశ్వరుడు ఆక్రమించి ఉన్నాడు. మనమందరము అతనియొక్క ప్రతిరూపాలమే. మరణానంతరము కర్మక్షయమైన జీవి ఆ పరమేశ్వరునిలో లీనమవుతుంది. కర్మక్షయం కాని జీవులు పుడుతూ, కర్మలు చేస్తూ చేసిన కర్మల ఫలితాన్ని అనుభవిస్తూ మరణిస్తూ, మరల పుడుతూ సంసారమనే బండిచక్రంలో

పడి గిరగిరా తిరుగుతుంటాయి. విడిగా ఉన్నప్పుడు ఇది గంగ, ఇది కృష్ణ, ఇది గోదావరి అని నదులకు పేర్లు ఉంటాయి. కాని అవి సముద్రంలో కలిశాక ఆ పేర్లు ఉండవు. అలాగే జీవించి ఉన్నంతవరకు ఇది పులి, ఇది సింహము, ఇది కుక్క, ఇది నక్క అని పేర్లుంటాయి. కాని మరణించిన తరువాత ఆ తేడా ఉండదు. అంతా ఒకటే ఆత్మ. కుండ ఉన్నంత వరకే ఇది ఘటాకాశము, ఇది మహదాకాశము అని తేడా ఉంటుంది. కుండను పగులగొట్టినట్లైతే ఘటాకాశం కాస్తా మహదాకాశంలో లీనమై పోతుంది. అలాగే కర్మక్షయమైన జీవాత్మ పరమాత్మలో లీనమయిపోతుంది. ఈ విషయం తెలుసుకోవటమే జ్ఞానము. జగత్తులోని ప్రతివస్తువుకు చైతన్యాన్ని ప్రసాదించేది ఆత్మ. కంటికి చూసే శక్తిని ప్రసాదించేది ఆత్మ. చెవికి వినే శక్తిని ప్రసాదించేది ఆత్మ. ఈ విషయాన్ని తెలుసుకోవటమే జ్ఞానము.

ఇక మూడవ పదము ఆనందము. ఆనందము అనేది రెండు రకాలు. 1. క్షణికానందము 2. శాశ్వతమైన ఆనందము. లౌకికమైన విషయ వాంఛలవల్ల పొందేది క్షణికానందము. ఇది అనుభవించినంతవరకే ఉంటుంది. ఆ తరువాత దుఃఖ హేతువు అవుతుంది. తీపి పదార్థాలు తినేటప్పుడు బాగానే ఉంటాయి. చాలా రుచిగా ఉంటాయి. కాని వాటిని తిన్న తరువాత వచ్చేవన్నీ కష్టాలే. ఇదే రకంగా లౌకిక సుఖాలన్నీ. కారు కొన్నాం. ఎక్కి తిరుగుతున్నాం. బాగానే ఉంది. కారు మధ్యలో రోడ్డుమీద చెడిపోయి ఆగిపోయింది. ఇప్పుడు దాన్ని వదలిపోలేము. అలా అని దానితోపాటు అక్కడ ఉండలేము. ఇలాగే 'రతికేళి' కూడా. ఇవన్నీ క్షణికానందాన్నిచ్చే సుఖాలే. ఇవన్నీ దుఃఖహేతువులు. రెండవది శాశ్వతమైన సుఖము. ఈ లోకంలోని సంపద అంతా యువకుడు, సదాచార సంపన్నుడు, వేదవేదాంగవిదుడు, బలమైనవాడు, ఆరోగ్యవంతుడు అయిన మానవుడు అనుభవించటానికే ఉన్నది. ఈ సంపదని అనుభవించటంవల్ల అతనికి వచ్చే ఆనందాన్ని మానుషానందము అంటారు.

మానుషానందానికి, నూరురెట్లు మనుష్య గంధర్వానందం. (మానవులుగా పుట్టి, పుణ్యకర్మలచేత గంధర్వత్వం పొందినవారు) మనుష్యగంధర్వానందానికి నూరు రెట్లు దేవగంధర్వానందం. (పుట్టుకతోనే దేవలోకంలో గంధర్వులుగా పుట్టినవారు) దేవగంధర్వానందానికి నూరురెట్లు చిరలోక పితరానందం. (చిరకాలం ఉండే లోకంలోని పిత్రుదేవతలు) చిరలోక పితరానందానికి నూరురెట్లు అజానజదేవానందం

(ఇది దేవలోకం పైన ఉన్నది. అక్కడివారు అజానజ దేవతలు) అజానజ దేవానందానికి నూరురెట్లు కర్మదేవానందం. (వైదిక కర్మలు చేసినవారు కర్మదేవతలు)

కర్మదేవానందానికి నూరురెట్లు దేవానందం. దేవానందానికి నూరురెట్లు ఇంద్రానందం. ఇంద్రానందానికి నూరురెట్లు బృహస్పతి ఆనందం. బృహస్పతి ఆనందానికి నూరురెట్లు ప్రజాపతి ఆనందం. ప్రజాపతి ఆనందానికి నూరు రెట్లు బ్రహ్మానందం. ఇదే శాశ్వతమైన ఆనందము. పరబ్రహ్మ సర్వకాల సర్వావస్థలయందు ఈ రకమైన శాశ్వతమైన ఆనందాన్ని పొందుతుంటాడు. అందుచేతనే "ఆనందమే స్వరూపముగా గలవాడు" అనబడతాడు. ఈ రకంగా పరమేశ్వరుడు 'సచ్చిదానంద రూపుడు'. గురువే సాక్షాత్తు పరబ్రహ్మ. భగవంతుడు కోపిస్తే గురువు రక్షిస్తాడు. కాని గురువు కోపిస్తే రక్షించేవాడు లేడు.

కాబట్టి ముందుగా నా గురుపరంపర అయిన విరజానందనాథ, సదానంద నాథ, శుకానందనాథులకు నమస్కరించి, ఏమీ తెలియని నన్ను ఆస్థాన విద్వాంసునిగా నియమించిన అవధూత దత్తపీఠాధిపతి సాక్షాత్తు దత్త స్వరూపులయిన శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి సాష్టాంగ దండప్రణామాలు అర్పించి, ధర్మ సంస్థాపన కోసం ఏర్పాటయిన శృంగేరీ, ద్వారక, పూరి, బదరి, కంచి పీఠాధిపతులకు నమస్కరించి, పెదపులిపాక లలితా పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ వాసుదేవానందగిరి స్వామివారికి, తాడేపల్లిలోని చైతన్య తపోవనం ట్రస్టు అధినేత శ్రీశ్రీశ్రీ మాతా శివచైతన్య వారికి, ఇంకా ఈ దేశంలోని పీఠాధిపతులకు, మఠాధిపతులకు, సద్గురువులకు అందరకు పేరు పేరునా నమస్కరించి **పరమానందనాథ** దీక్షానామం గలిగిన హరితస గోత్రీకుడనైన 'క్రోవి పార్థసారథి' అను నేను గురువు యొక్క విశిష్టత అందరికీ తెలియాలనే ఉద్దేశ్యంతో **'గురుతత్త్వము'** అనే ఈ చిన్న గ్రంథాన్ని అతిసులభమైన శైలిలో అందరికీ అందుబాటులో ఉండే విధంగా నాచేతనైన మేరకు అందించటానికి ప్రయత్నిస్తున్నాను. సద్గురువులు, పండితులు, ఉపాసనాపరులు అందరూ నా యీ ప్రయత్నాన్ని మన్నించి నన్ను ఆశీర్వదింతురుగాక.

## 2. మంత్రోపదేశం

అజ్ఞానము అనే అంధకారాన్ని పారద్రోలి, జ్ఞానజ్యోతిని వెలిగించేవాడు గురువు. సాధకుడికి మంత్రోపదేశం చేసి, దీక్ష ఇచ్చి, సాధనా విధానం చెప్పి, ముక్తి మార్గం చూపేవాడు గురువు. ఈ విషయాలను వివరంగా చూద్దాం.

ముందుగా సాధకుడికి మంత్రోపదేశం చేస్తాడు. అయితే మంత్రం ఎవరి దగ్గర పుచ్చుకోవాలి? అనే దాన్ని బాగా ఆలోచించాలి. దొరికాడు కదా అని ఎవరి దగ్గర పడితే వారి దగ్గర మంత్రం పుచ్చుకోకూడదు. మంత్రాన్నిచ్చేవాడు పవిత్రుడై, నిర్మలమనస్కుడై, స్వార్థరహితుడై ఉండాలి. శిష్యుని దగ్గర నుంచి ఏమీ ఆశించనివాడై ఋజుప్రవర్తన కలిగి ఉండాలి. మంత్రాన్ని బాగా పురశ్చరణ చేసినవాడై ఉండాలి. మంత్రసిద్ధుడై ఉండాలి. వీటిలో ఏ లక్షణాలు లేకపోయినా అతని దగ్గర మంత్రం తీసుకోవటం వల్ల వచ్చే లాభం కన్న నష్టమే ఎక్కువ. ఇక్కడ ఒక చిన్న ఉదాహరణ చూడండి. నాకు తెలిసిన ఆయన ఒక గురువుగారి దగ్గర మంత్రం పుచ్చుకున్నాడు. మంత్రం ఇచ్చినాయన లౌకికుడు. పుచ్చుకున్నాయన ఫరవాలేదు కొద్దిగా డబ్బులున్న వాడు. మంత్రం ఇచ్చిన కొద్ది రోజులకు శిష్యుడికి ఫోను చేసి నేను ఇల్లు కట్టుకుంటున్నాను. కొంచెం డబ్బు సర్దుబాటు కావాలి. ఒక లక్ష రూపాయలుంటే ఇవ్వండి. మళ్ళీ నా చేతుల్లోకి డబ్బు రాగానే ఇచ్చేస్తాను అన్నాడు. ఇప్పుడు కుడితి తొట్టిలో పడ్డ ఎలుక తంతు అయింది శిష్యుడికి. ఏం చెయ్యాలో తెలియలేదు. ఒకవేళ డబ్బు ఇస్తే అది తిరిగిరాదు. ఇవ్వకపోతే గురువుగారు కోపగిస్తారు. ఏం చెయ్యాలి? ఈ రకంగా మధనపడి చివరికి ఒక నిర్ణయానికి వచ్చి "అయ్యా గురువుగారూ! ప్రస్తుతం నా దగ్గర డబ్బులేదు. ఒకవేళ గనక డబ్బు వస్తే, మీరడిగినట్లే ఇస్తాను." అన్నాడు. శిష్యుడు అబద్ధం చెబుతున్నాడు అని గురువు గారికి తెలిసిపోయింది. దాంతో ఆయన కోపగించాడు. ఒకరోజు మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో శిష్యుడికి ఒక రిజిష్టరు కవరు వచ్చింది. ఎవరి దగ్గర నుంచి వచ్చిందో పూర్తిగా తెలియలేదు. అక్కడ వ్రాసిన అడ్రసుగాని, పేరుగాని తనకు పరిచయం లేవు. అయితే చేరవలసిన అడ్రసు మాత్రం తనదే. కవరు చూస్తే బరువుగానే ఉంది. సరే కవరు తీసుకుని చింపాడు. వెంటనే అందులోంచి కొంత బూడిద, రెండు బొగ్గులు, వెంట్రుకలు, రెండు ఎండు మిరపకాయలు, నిమ్మకాయ బయట పడ్డాయి. అది చూడగానే అవాక్కైపోయాడు. భయంతో వణికిపోయాడు. ఏమిటీ అపశకునం? ఎవరు పంపించి ఉంటారు? అని ఫ్రమ్ అడ్రస్ మళ్ళీ చూశాడు. తన గురువుగారి ఊరే. పేరు మాత్రం కాదు. ఇంకేం. ఇది తన గురువుగారి పనే అయి ఉంటుంది. ఆయన క్షుద్రవిద్యలు కూడా చేస్తాడని తాను విన్నాడు. ఎవరికి చెప్పుకుంటాడు? ఏమీ చెయ్యలేక తనకు తెలిసిన మంత్రాలే జపం చేస్తూ కూచున్నాడు.

భయంతో సాయంత్రానికి జ్వరం కూడా వచ్చింది. రెండు రోజులదాకా తగ్గలేదు. ఈ జ్వరం వచ్చిన కవరు ప్రభావమే అని నమ్మాడు. ఇంకేముంది? శిష్యుడైన తన మీద ఇంత పని చేస్తాడా? అనే కోపం, గురుధిక్కారంతో మళ్ళీ ఆయన దగ్గరకు పోలేదు. ఇక్కడ గురువు స్వార్థపరుడు. అటువంటి వారి దగ్గర మంత్రం తీసుకోకూడదు. ఇక్కడ డబ్బులతో నిమిత్తం ఏమాత్రం ఉండకూడదు.

ఒకసారి ఒక పెద్దాయన దగ్గర కూర్చుని ఏదో మాట్లాడుతున్నాను. ఆయన వేదపండితుడు. ఘనపాఠీ. శ్రీవిద్యలో గట్టివాడు. మేం మాట్లాడుతుండగా ఒకాయన వచ్చాడు. ఆ వచ్చినతను ఘనపాఠీగారికి పరిచయమే. ఆయన వచ్చీ రావటంతోనే "ఘనపాఠీ"గారూ మీతో కొంచెం పనుండి వచ్చాను. రేపు మా మేనల్లుడికి "షోడశి మహామంత్రం" చెప్పాలి. కాబట్టి ఈ పుస్తకంలో ఎక్కడ నుంచి ఎక్కడిదాకా చెప్పాలో గుర్తుపెట్టివ్వండి" అన్నాడు. రెండు క్షణాలు మౌనంగా ఉండి ఈ పండితుడు, ఆ పుస్తకంలో కొన్ని గుర్తులు పెట్టి ఇచ్చాడు. అది తీసుకుని చకచకా వెళ్ళిపోయాడు ఆ పెద్ద మనిషి. అప్పుడు ఘనపాఠీగారు నాతో "ఈయన షోడశి మహామంత్రం ఉపదేశం చేస్తాడట. ఏం చెప్పాలో ఈయనకి తెలియదు. ఏం కావాలో వాడికీ తెలియదు. చివరకు ఇలా అయిపోయింది మంత్రశాస్త్రం" అంటూ ఒక నిట్టూర్పు విడిచారు.

ఇక్కడ మంత్రోపదేశం చేసే గురువుకు ఏ మంత్రం చెప్పాలో కూడా తెలియదు. మరి అటువంటి గురువు దగ్గర మంత్రం చెప్పుకుని ఉపయోగం ఏమిటి? మనం లెక్కలు చెప్పుకోవాలంటే, చెప్పే ఉపాధ్యాయుడికి ఆ విషయం మీద పూర్తి అవగాహన, పట్టు ఉండాలి. ఆ లెక్క తనకే రాకపోతే ఇంక మనకేం చెబుతాడు? కాబట్టి మంత్రం చెప్పే గురువుకు మంత్రసిద్ధి ఉండాలి. ఆ మంత్రాన్ని గురించి పూర్వాపరాలు క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. శిష్యుడికి ఏ రకమైన అనుమానం వచ్చినా తీర్చగలిగి ఉండాలి. మంత్రజపం ఏ రకంగా చెయ్యాలో చెప్పాలి. మంత్రసిద్ధికి మార్గం చెప్పగలగాలి. అటువంటి గురువును మనం జాగ్రత్తగా వెతికి పట్టుకోవాలి. అంతే కాని ఎవరి దగ్గర పడితే వారి దగ్గర మంత్రోపదేశం తీసుకోరాదు.

గురువు ప్రశాంత చిత్తుడు, శాంతస్వభావుడు అయి ఉండాలి. అటువంటి గురువును గుర్తుపట్టటం ఎలా? అంటే ఏ మహాత్ముడు నీకు బాగా గుర్తుంటాడో, ఏ మహానుభావుని రూపం నీ మనసులో సదా నిలిచిపోతుందో, ఎవరు నీకు స్వప్నంలో

కూడా కనిపించి సన్మార్గాన్ని బోధిస్తుంటారో, ఎవరు చెప్పిన ధర్మసూత్రాలు, ఉపదేశాలు నీ మదిలో సదా నిలచిపోతాయో, ఏ మహానుభావుడి దగ్గరకు వెళ్ళగానే నీ అనుమానాలన్నీ తీరిపోతాయో, ఏ వ్యక్తి దగ్గర నీకు ప్రశాంతత, ఆనందము కలుగుతాయో, ఏ వ్యక్తిమీద నీకు నమ్మకము, గురి కలుగుతాయో, అతడే నీకు గురువు.

గురువు శిష్యుల బంధం ఒకనాటిది కాదు. అది జన్మజన్మల బంధం. మనకి కొంతమందిని చూడగానే వాళ్ళు క్రొత్తవాళ్ళైనా సరే, వాళ్ళు మనకి బాగా తెలుసు అనిపిస్తుంది. వాళ్ళతో బాగా పరిచయం ఉన్నట్టు అనిపిస్తుంది. వాళ్ళతో చాలా ఆప్యాయంగా మాట్లాడతాం. కొద్దికాలంలోనే వాళ్ళకీ మనకీ మధ్య ఆత్మీయత బాగా పెరిగిపోతుంది. అదే కొంతమందిని చూడగానే కోపం వస్తుంది. కారణం తెలియదు. ఇదే జన్మజన్మలబంధం. గురుశిష్యుల మధ్య ఉండే బంధంకూడా అలాంటిదే.

మనకు మొత్తం ఏడు రకాలయిన గురువులున్నారు

**1. సూచకగురువు :** చిన్నప్పటి నుంచీ అక్షరాలు నేర్పి, చదువు చెప్పేవాడు. నిన్ను ఒక మనిషిగా తీర్చిదిద్దేవాడు. ఎప్పుడు ఎలా ప్రవర్తించాలో వివరించి చెప్పేవాడు. ఇతడు సూచక గురువు. అయితే మనం కె.జి. దగ్గర నుంచి పి.జి.దాకా అనేకమంది ఉపాధ్యాయుల దగ్గర చదువు నేర్చుకుంటాం. వీరందరూ మనకు లౌకిక విద్యను బోధించేవాళ్ళే. సుఖసౌఖ్యాలు, భోగభాగ్యాలు, పదవులు ఏ రకంగా పొందాలో వివరించి చెప్పేవాళ్ళు. తగిన సూచనలిచ్చే వాళ్ళు.

**2. వాచక గురువు :** ఇక్కడినుంచి గురుస్థానం మారిపోతుంది. సూచక గురువు ఈ లోకంలో బ్రతకటానికి అవసరమైన విద్యను చెబితే మిగిలినవాళ్ళు అలౌకికమైన విద్యను చెబుతారు. అందులో మొదటివాడు వాచకగురువు. వర్ణాశ్రమ ధర్మాలను వివరించి చెప్పేవాడు.

**చాతుర్వర్ణంమయా స్పష్టం గుణకర్మవిభాగచ** అన్నాడు భగవానుడు గీతలో. అంటే మానవులు చేసే పనిని, స్వీకరించిన వృత్తిని బట్టి నాలుగు వర్ణాలుగా వారిని నేను విభజించాను అని చెప్పాడు. చాతుర్వర్ణాలు వేరు. ఇప్పుడు మనం చెప్పుకునే కులాలు వేరు. ఈ కులాలు కేవలం మనం నిర్మించుకున్నవి. చాతుర్వర్ణాలు మనం చేసే పనిని బట్టి విభజింపబడినవి. ఇక్కడ తేడా ఏమంటే ఒక కులంవాడు ఇంకొక కులంలోకి మారటం అనేది ఉండదు. కాని వర్ణాలలో అలాకాదు. వారు చేసే

పనినిబట్టి వర్ణము మారిపోతుంది. క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయినాడు. బ్రాహ్మణుడైన రావణబ్రహ్మ రాజయినాడు. ఈ రకంగా కులము అనేది సంకుచితమైన భావంతో ఏర్పాటయింది. కాగా వర్ణానికి విస్తృతమైన పరిధి ఉన్నది. అందుకే ఈ వర్ణ విభజన భగవానుడితో చెయ్యబడింది. పరమేశ్వర స్వరూపము అంటే చరాచర జగత్తే. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు అయిన పరమేశ్వరుడు ఈ జగత్తంతా ఆవరించి ఉన్నాడు. విశ్వరూపాన్ని వివరించేటప్పుడు యజుర్వేదంలోని పురుష సూక్తంలో

**బ్రాహ్మణోస్య ముఖమాసీత్ । బాహూరాజన్యః కృతః ।**
**ఊరూతదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ం సూద్రో అజాయత ।**

అని చెప్పబడింది. అంటే పరమేశ్వరుని ముఖం నుంచి బ్రాహ్మణులు, బాహువుల నుంచి క్షత్రియులు, ఊరువుల నుంచి వైశ్యులు, పాదముల నుంచి శూద్రులు జన్మించారు అని అర్థం చెబుతాం. ఇది సరికాదు. తప్పు. ఎందుకంటే ఇక్కడ చెప్పిన దాన్ని బట్టి బ్రాహ్మణులు అందరికన్న ఉన్నతులని, శూద్రులు అధములనే అర్థం స్ఫురిస్తోంది.

ఒకసారి ఒకచోట చర్చా గోష్ఠి జరుగుతోంది. అందులో ఒక కుహనాపండితుడు లేచి ఇక్కడ చెప్పిన పురుషసూక్తం చెప్పి, పైన చెప్పిన అర్థాన్ని వివరించి తన ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించాడు. వెంటనే ఇంకొక వ్యక్తి లేచి "జీవి ఎలా జన్మిస్తుంది. అనేది అందరికీ తెలుసు. పశువులు, పక్షులు, మృగాలు, మనుషులు అందరూ యోని సంభవులే. అలాంటప్పుడు కళ్ళు, ముఖముల నుంచి పుట్టటమేమిటి? ఇదెక్కడైనా సంభవమా ? ఇవన్నీ మీ ఆధిక్యం నిరూపించుకోవటానికి చెప్పిన మాటలు. మీ వేదం అంతా ఇలాగే ఉంటుంది." అంటూ ఎద్దేవా చేశాడు. దాంతో మొదట చెప్పిన పెద్ద మనిషి ముఖం కాస్తా మాడిపోయింది. ఏ సమాధానం చెప్పలేక తలవంచుకుని ఉండిపోయాడు. దీంతో రెండవ వ్యక్తి పేట్రేగిపోయాడు. కాబట్టి ఏదైనా విషయం చెప్పాలంటే దాన్ని గురించి మనకి పూర్తిగా తెలియాలి. అలా తెలిస్తేనే మనం మాట్లాడాలి. ఒకవేళ విషయం తెలిసినా సందర్భాన్ని బట్టి చెప్పాలి. అంతేకాని మనకి తెలుసుకదా అని నోటికి వచ్చింది చెప్పరాదు. ఇకపైన చెప్పిన దానికి వివరణ గనక చూసినట్లైతే జీవి జన్మించేది కేవలము యోనినుంచే కాదు.

'ఛాందోగ్యోపనిషత్తు'లో స్థావర జంగమాత్మకమైన జీవులన్నీ పుట్టుకరీత్యా అనేక విధాలుగా ఉన్నాయి.

**1. అండజాలు :** గ్రుడ్డునుంచి పుట్టేవి. (పక్షులు, పాములు మొ॥వి)

**2. జీవజాలు :** జీవులవలన పుట్టేవి. (మనుష్యులు, పశువులు మొ॥వి)

**3. ఉద్భిజాలు :** విత్తన లవల్ల భూమినుంచి పుట్టేవి. (చెట్లు, చేమలు)

**4. స్వేదజాలు :** చెమట లేక బురద నుంచి పుట్టేవి.

**5. ఊష్మజాలు :** వెచ్చదనంవల్ల పుట్టేవి (క్రిమికీటకాలు)

ఈ రకంగా సృష్టి జరుగుతుంది. ఈ విషయాన్ని సైన్సుకూడా ఒప్పుకుంటుంది. ఇక పోతే బ్రాహ్మణుడు ఆ పరమేశ్వరుని ముఖం నుంచి, క్షత్రియుడు బాహువుల నుంచి, వైశ్యుడు ఊరువుల నుంచి, శూద్రుడు పాదాల నుంచి పుట్టారు అనే దీనియొక్క అర్థం యధాతథంగా చెప్పరాదు. అన్ని వర్ణాలవారూ ఆ పరమేశ్వరుని రూపాలే అని చెప్పబడింది. ఇందులో ఒకరి ఎక్కువా, ఇంకొకరి తక్కువా లేదు. అందరూ కలిస్తేనే పరమేశ్వర స్వరూపం. శరీరంలో పాదాలు నీచమైనవి అనుకుంటే వాటిని నరికి పారెయ్యగలమా? శిరస్సు (ముఖం) ముఖ్యమైనది అంటే దాన్ని శరీరం నుంచి వేరుచేసి ఉన్నతమైన ఆసనంలో పెట్టి పూజిస్తామా? వీటిలో ఏ భాగం లేకపోయినా శరీరం ఉండదు. అలాగే జీవరాశి అంతా కలిస్తేనే పరమేశ్వర స్వరూపం. అందుకే ఈ జగత్తంతా పరమేశ్వరుడికి ప్రతీక. జగత్తులోని జీవరాశి అంతా ఒకటే. జీవించి ఉన్నంతవరకే ఇది పులి, ఇది సింహము, ఇది పక్షి, ఇతడు మనిషి అనే తేడా ఉంటుంది. మరణానంతరము ఆత్మ ఒక్కటే. అందులో ఏ తేడా ఉండదు.

అసలు ఈ వర్ణవ్యవస్థ ఎందుకోసం ఏర్పడింది? దీన్ని గురించి 'బృహదారణ్యకోపనిషత్తు'లోని 'హిరణ్యగర్భోపాసన'లో వివరించబడింది. నామరూపాత్మకమైన ఈ సృష్టికి ఆరంభంలో ఉన్నది కేవలము పరబ్రహ్మ స్వరూపము. అదే విరాడ్రూపంలో ఉన్న అగ్ని. అదే బ్రాహ్మణరూపం. అంతవరకు క్షత్రియాది ఇతర వర్ణాలు లేవు. జనాభా పెరుగుతోంది. క్షత్రియులు లేకపోవటంవల్ల పాలనా వ్యవహారాలు కష్టమైనాయి. అప్పుడు ఆ విరాట్పురుషుడు క్షత్రియుల్ని సృష్టించాడు. క్షత్రియుల్ని సృష్టించిన తరువాత కూడా పరబ్రహ్మ తన పనిలో తాను కృతకృత్యుడు కాలేక పోయాడు. సంపాదనను, ధనాన్ని కూడబెట్టేవాడు లేకపోవటం వల్ల బ్రహ్మ తన

పనిలో విజయం సాధించలేకపోయాడు. అందుచేత వైశ్యజాతిని సృష్టించాడు. ఆ తరువాత జనాభా పెరిగిపోయింది. అప్పుడు వీరందరినీ పోషించటం కోసం శూద్రుణ్ణి సృష్టించాడు ప్రజాపతి. ఈ రకంగా చాతుర్వర్ణాలు సృష్టించబడ్డాయి.

ఇక ఆశ్రమాలు. ఇవి నాలుగు. వీటినే చతురాశ్రమాలు అంటారు. అవి 1. బ్రహ్మచర్యము, 2. గృహస్థాశ్రమము, 3. వానప్రస్థము, 4. సన్యాసము. ఇందులో 'బ్రహ్మచర్యము' అనేది విద్యార్థి దశ. ఈ దశలో విద్యార్థి తాను బ్రతకటానికి కావలసిన విద్యని నేర్చుకుంటాడు. ఆ తరువాత వివాహం చేసుకుని గృహస్థు అవుతాడు. కొంతకాలం తరువాత బాధ్యతలన్నీ తీర్చుకుని అరణ్యాలకు పోయి భగవచ్చింతనలో జీవితాన్ని గడుపుతాడు. ఈ స్థితినే 'వానప్రస్థము' అంటారు. ఈ సమయంలో కర్మలు చేస్తూనే ఉంటాడు. తరువాత కర్మలు చేసినా చెయ్యకపోయినా ఫలితం ఒకటే అని తెలుసుకుని, సర్వస్వాన్ని త్యజించి ఏకాంత ప్రదేశాలలో ఒంటరి జీవితం సాగిస్తాడు. ఇది సన్యాసము. ఈ స్థితిలో లౌకిక విషయాలను పూర్తిగా వదలివేసి, కేవలము సత్యాన్వేషణ చేస్తూ ముక్తి మార్గాన్ని వెతుక్కుంటాడు.

ఈ రకంగా చాతుర్వర్ణాలు, చతురాశ్రమాలు, వాటి ధర్మాలను వివరించి చెప్పేవాడు 'వాచక గురువు'.

**3. బోధక గురువు :** మహామంత్రాలను ఉపదేశించేవాడు. అసలు మంత్రం అంటే ఏమిటి? **మననాత్ త్రాయత ఇతిమంత్రః** మననము చెయ్యటంవల్ల, ఆ మననం చేసేవాణ్ణి రక్షించేదాన్ని 'మంత్రము' అంటారు. ఒకే అక్షరము, పదము, మాట లేదా వాక్యాన్ని పదేపదే ఉచ్చరించటం వల్ల కొంతశక్తి పుడుతుంది. ఆ శక్తి ఆ మంత్రాన్ని మననం చేసినవాణ్ణి రక్షిస్తుంది. మంత్రాలు రెండు రకాలు 1. సామాన్య మంత్రాలు. ఇవి లౌకిక ప్రయోజనం కోసం ఉపయోగిస్తాయి. ధనము, ఐశ్వర్యము, అధికారము, పరపతి వంటి సాధించటానికి ఈ రకమైన మంత్రాలు ఉపయోగిస్తారు. ఇక రెండవది 'మహామంత్రాలు'. ఇవి మోక్షకారకాలు. విద్య అనేది రెండు రకాలు. 1. పరావిద్య 2. అపరావిద్య. వీటిని గురించి ముండకోపనిషత్తులో వివరించబడింది. శునకుని యొక్క కుమారుడైన శౌనకుడు కఠోర నియమాలతో బ్రహ్మచర్యం పాటించి, విద్యాభ్యాసం పూర్తిచేసి, గురువుగారి దగ్గరకు వెళ్ళి "గురువర్యా" దేన్ని గురించి తెలుసుకోవటంవల్ల సర్వమూ తెలుస్తుందో దయచేసి దాన్ని నాకు వినిపించండి అన్నాడు. అప్పుడు ఆ మాటలు విన్న శునకుడు "నాయనా ! వేదాల్లో రెండు

విద్యలు ఉన్నాయి. 1. అపరావిద్య, 2. పరావిద్య. అపరావిద్య లౌకిక ప్రయోజనాలకు ఉపకరిస్తే, పరావిద్య మోక్షమార్గాన్ని చూపుతుంది. మహామంత్రాలు కూడా ఈ కోవకు చెందినవే. ఈ మహామంత్రాలను ఉపదేశించేవాడు మంత్రగురువు లేదా బోధక గురువు.

ఇక్కడ మంత్రం ఉపదేశించటం అంటే, మంత్రాన్ని వప్పగించటం కాదు. మంత్రాన్ని ఏ విధంగా చెయ్యాలో, సాధనక్రమం ఏమిటో, మంత్రాధి దేవత ఎవరు? మంత్ర సాహిత్యం. ఇవన్నీ పరిపూర్ణంగా వివరించగలగాలి. మంత్రంలో ఎన్ని అక్షరాలున్నాయి? వాటి అర్ధం ఏమిటి? ఈ విషయాలన్నింటినీ తన శిష్యుడికి పూర్తిగా విశేషించి చెప్పగలవాడే మంత్రగురువు.

**4. నిషిద్ధగురువు :** ఒకే అక్షరాన్ని, పదాన్ని లేక మాటని పదేపదే ఉచ్చరించటం వల్ల కొంత శక్తి పుడుతుంది అని గతంలో చెప్పుకున్నాం. ఈ రకంగా పుట్టిన శక్తి వల్ల ఏ పని చెయ్యాలి? అనేది సాధకుడి యొక్క ఆలోచన మీద ఆధారపడి ఉంటుంది. ఆ శక్తివల్ల తనకు కావలసిన ఐహిక వాంఛలు తీర్చుకోవచ్చు. అంటే ధనదాన్యాలు, భోగభాగ్యాలు, సిరిసంపదలు పొందవచ్చు. పుణ్యలోకాలు పొందవచ్చు. మోక్షమార్గం వైపు పయనించవచ్చు. ఆ శక్తిని లోకకళ్యాణానికి వినియోగించవచ్చు. ఇతరుల బాధలు తీర్చవచ్చు లేదా ఇతరులను వశం చేసుకోవటానికి వాడవచ్చు. ఇతరుల నాశనానికి కూడా ఈ శక్తిని ఉపయోగించవచ్చు. అయితే జపం చేసేటప్పుడు చెప్పే సంకల్పంలోను, సాధన విధానంలోను, క్రియలోను కొంత తేడా ఉంటుంది. మనదగ్గర ఉన్న శక్తిని లోకకళ్యాణంకోసం ఉపయోగించేవాడు ఉత్తముడు. ఇతరుల కోసం ఉపయోగించేవాడు మధ్యముడు. తన కోసం ఉపయోగించేవాడు అంటే తాను ఐహిక సుఖాలు పొందటానికి ఉపయోగించేవాడు అధముడు. ఆ శక్తితో ఇతరులకు హాని కలిగించేవాడు అధమాధముడు. ఆ శక్తితో మారణాది ప్రక్రియలు చేసేవాడి నీచత్వాన్ని చెప్పటానికి అసలు పదాలే లేవు. ఈ రకంగా వశీకరణ, మారణ ప్రయోగాలు నేర్పేవాడు నిషిద్ధగురువు.

అసలు వశీకరణాది విద్యలవల్ల మనకు జరిగేది ఏమిటి? ఈ రోజుల్లో కొన్ని పుస్తకాలలో మనం చూస్తుంటాం. ఒక మంత్రం చెప్పి, ఈ మంత్రాన్ని లక్షసార్లు జపం చేసి, ఆఖరిరోజున నువ్వు కోరిన స్త్రీ ఇంటి ఎదురుగా దీపం పెట్టినట్లైతే, ఆ రోజు నుంచి ఇరవై ఒక్కరోజుల లోపల, ఆ స్త్రీ నీకు వశమవుతుందని వ్రాయబడి

ఉంటుంది. ఇలాటివాటిని చూసి ముఖ్యంగా యవ్వనంలో ఉన్న పిల్లలు ఆకర్షితులవుతుంటారు. వీటివల్ల వరిగేది ఏమీ ఉండదు. శ్రమ వృధా తప్ప. వేరే ప్రక్రియల ద్వారా ఇటువంటి పనులు చేసి స్వార్థంతో ఇతరులను వశం చేసుకున్నట్లైతే, అలాంటివాడు పిశాచమై, తినటానికి తిండి, త్రాగటానికి నీరులేక అమితమైన వేదన అనుభవిస్తూ తెలిసినవారి ఛీత్కారాలు అనుభవిస్తూ ముప్పదిఆరు వేల సంవత్సరాలు నిర్జన ప్రదేశంలో ఉన్న మర్రిచెట్టుకు తలక్రిందులుగా వ్రేలాడుతూ ఉంటాడని శాస్త్రం చెబుతోంది. అలాగే ఇతరుల దగ్గర డబ్బులు తీసుకుని, నిష్కారణంగా తనకు పరిచయం కూడా లేనివాళ్ళమీద చేతబడులు చేస్తూ, మరణాన్ని ప్రయోగించేవాడు పైన చెప్పిన విధంగా లక్ష సంవత్సరాలు పిశాచ రూపంలో మర్రిచెట్టుకు వ్రేలాడి, ఆ తరువాత అశుద్ధంలో పురుగుగా పుడుతూ, చస్తూ ముప్పైవేల జన్మలు ఎత్తుతాడు. ఆ తరువాత క్రిమికీటకాదుల నుంచి మళ్ళీ జీవనచక్రం ప్రారంభిస్తాడు. కాబట్టి విజ్ఞులైన వారెవరూ అటువంటి మార్గం వైపు వెళ్ళరు.

కాని లోకకళ్యాణం కోసం ఒక్కొక్కసారి ఇటువంటి పనులు చెయ్యవలసి ఉంటుంది. అందుచేతనే ఇటువంటి విద్యలు సత్వగుణ ప్రధానంగా గలవారి దగ్గర మాత్రమే ఉండాలి. ధర్మసూక్ష్మం గ్రహించగల వారు మాత్రమే దీన్ని ఉపయోగించాలి ఈ విద్య నేర్చినవారు సంయమనం పాటించాలి. విధిలేని పరిస్థితిలో మాత్రమే దీన్ని వాడాలి. ఈ విద్య అంత నిషిద్ధమైనది. ఈ రకమైన విద్యను నేర్పేవాడు నిషిద్ధగురువు. మొత్తంమీద దీని జోలికి వెళ్ళకుండా ఉండటం ఉత్తమము.

**5. విహిత గురువు :** హితము అంటే తగినది, ప్రియమైనది, ఉపయోగకరమైనది, శుభకరమైనది అని అర్థం. విహితము అంటే తగనిది, ఉపయోగము లేనిది అని అర్థం. జీవితంలో ప్రతివాడూ సుఖాలు అనుభవించాలి అనే అనుకుంటాడు. ఇక్కడ సుఖము అనేది రెండు రకాలుగా ఉంటుంది. 1. క్షణికము 2. శాశ్వతము. మనం అనుభవించే సుఖాలన్నీ క్షణికమైనవే. వీటివల్ల ఆనందం పొందుతాం. కాని ఆ ఆనందం ఎక్కువసేపు నిలవదు. ఉదాహరణకు తీపి పదార్థం తింటే వచ్చే ఆనందం అది తిన్నంతవరకే ఉంటుంది. ఒక వస్తువును పొందాలి అనుకున్నాం. చాలా శ్రమపడి ఆ వస్తువును పొందగలిగాం. దాన్ని పొందినప్పుడు గొప్ప ఆనందం పొందుతాం. కాని ఆ ఆనందం ఎక్కువ కాలం ఉండదు. చివరకు రతిసుఖంకూడా అంతే. మనకు తెలియని వ్యామోహంలో పడి, భ్రాంతిలో పడి, అక్కడ ఏదో ఉన్నది.

దాన్ని మనం పొందాలి అనుకుంటాం. పొందుతాం. తద్వారా ఆనందం వస్తుంది. కాని ఆ ఆనందం కొద్దికాలమే ఉంటుంది. ఇదే క్షణికానందం. ఈ రకమైన ఆనందం మళ్ళీ దుఃఖానికి హేతువు. విషయ భోగాలన్నీ అంతే. అనుభవించినకొద్దీ ఇంకా ఇంకా కావాలి అనిపిస్తుంది. దానికి అంతం ఉండదు. వాటిని అనుభవించటానికి ధనం కావాలి. ధనార్జన కోసం అనేక అడ్డదారులు త్రొక్కాలి. ఇంతా కష్టపడి పొందిన ఆనందం ఒక్క క్షణంలోనే ఆవిరి అయిపోతుంది. అందుకే క్షణికమైన ఆనందం కోసం వెంపర్లాడరాదు. ఈ మాట చెప్పటానికి బాగానే ఉంది. కాని విషయవాంఛల నుంచి దూరం కావటం ఎలా? అది అంత తేలికైనదా? అయితే ఈ జగత్తులో సంసారమనే బండి చక్రంలో పడి ఇంతమంది గానుగకు కట్టిన ఎద్దులలాగా గిరగిరా తిరుగుతుంటారా? కాదు. విషయవాంఛలలో నుంచి బయట పడటం అంత తేలిక కాదు. శ్లేష్మంలో పడిన ఈగ ఏ రకంగా బయటకు రాలేదో, అలాగే విషయ వాంఛలలో చిక్కిన మానవుడు కూడా ఒకవేళ అందులోనుంచి బయటపడగలిగితే, అప్పుడు శాశ్వతమైన సుఖాన్ని పొందగలుగుతాడు. అదే బ్రహ్మానందము.

ఆ ఆనందాన్ని పొందాలి అంటే ముందుగా విషయ భోగాల నుంచి బయట పడాలి. అది ఎలా సాధ్యం? సుఖదుఃఖాలకు కారణమైనది మనస్సు. ఆ మనస్సును గనక నిగ్రహించినట్లైతే ఇది సాధ్యపడుతుంది. అంటే ముందుగా రాగద్వేషాలను జయించాలి. ఈ పని చెయ్యాలంటే మనోనిగ్రహం కావాలి. మనసును స్వాధీనంలోకి తెచ్చుకోవాలి. సంకల్పవికల్పాలే మనస్సు. అవి లేకుండా చెయ్యాలి. మనోనాశనం కావాలి. ఇది కేవలము నిరంతర సాధనవల్లనే సాధ్యపడుతుంది. ఈ రకమైన సాధనను ఆచరింపచేసి, విషయభోగాల మీద, సంసార సుఖాలమీద విరక్తి కలిగించేవాడే విహితగురువు.

**6. కారణగురువు :** జీవబ్రహ్మైక్యాన్ని బోధించేవాడు కారణ గురువు. లోకంలో ఎన్ని పనులు చేసినా, ఎన్ని సుఖాలు పొందినా, మానవుడి యొక్క అంతిమ లక్ష్యం మోక్షం. అదే జన్మరాహిత్యం. ముక్తి అంటే విముక్తి. ఐహిక బంధనాల నుంచి విముక్తి. అదే మోక్షం. మరణానంతరము మానవుడియొక్క జీవాత్మ పరమాత్మలో లీనం కావాలి. ఇక్కడ జీవాత్మ పరమాత్మ వేరుకాదు. రెండూ ఒకటే. అలాంటప్పుడు జీవాత్మ పరమాత్మలో లీనం కావటం ఏమిటి? అనే అనుమానం వస్తుంది. జీవి జీవించి ఉన్నంతవరకు అతనిలో ఉన్నది జీవాత్మ. బయట ఉన్నది పరమాత్మ.

కుండలో ఉన్నది ఘటాకాశం. బయట ఉన్నది మహదాకాశం. కుండ పగిలిపోతే ఘటాకాశం కాస్తా మహదాకాశంలో లీనమయిపోతుంది. అప్పుడు ఘటాకాశం, మహదాకాశం అని వేరు వేరుగా ఉండవు. ఉండేది ఒక్కటే ఆకాశం. అలాగే శరీరం ఉన్నంతవరకే ఇది జంతువు, ఇది పక్షి అని పిలువబడుతుంది. శరీరం నశించాక ఈ జీవాత్మ, పరమాత్మ విడివిడిగా ఉండవు. ఉండేది ఒకటే "పరబ్రహ్మ". మరణానంతరం ఈ జీవాత్మ గాలిలో గాలిలాగా, నీటిలో నీరులాగా, ఆకాశంలో ఆకాశంలాగా పరమాత్మలో లీనమవుతుంది. అందుచేతనే జీవాత్మ పరమాత్మల ఏకీకరణమే మోక్షము. ఈ విషయాలను వివరించి చెప్పేవాడే 'కారణగురువు'

**7. పరమగురువు :** ఇప్పటివరకు అనేక సాధనలు చేశాడు. చివరకు జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అనే విషయాన్ని తెలుసుకోగలిగాడు. దీనివల్ల పూర్తి ఫలితం రాదు. ఎందుకంటే, ఇదంతా విషయ పరిజ్ఞానమే. మోక్షం కావాలంటే అనుభవం కావాలి. **అహంబ్రహ్మోస్మి** అనేది కేవలం ఒక పదంగా కాక అనుభవంలో తెలుసుకోవాలి. నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని. నేను తప్ప ఇంకెవ్వరూ లేరు. ఉన్నదంతా నేనే. ఈ చరాచర జగత్తంతా నా నుంచే ఆవిర్భవిస్తున్నది. చివరకు నాలోనే లీనమవుతున్నది. సృష్టి స్థితి లయాలన్నీ నానుంచే జరుగుతున్నాయి. అనే విషయాలు ప్రత్యక్షానుభవం ద్వారా తెలుసుకోవాలి. జగత్తులోని సర్వప్రాణులు సమానమే. అన్నింటియందు ఉన్నది ఒకటే ఆత్మ. నా ఎదురుగా ఉన్న మనిషిలో ఉన్నది, నా ప్రక్కన ఉన్న ఆవులో ఉన్నది, క్రూరజంతువైన పులియందున్నది, క్రిమికీటకాదులందున్నది, నాలో ఉన్నది ఒకటే ఆత్మ. అదే పరబ్రహ్మ. అదే నేను **'ఛాందోగ్యోపనిషత్తు'**లో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మజ్ఞానం వివరిస్తూ పరమాత్మ అంతర్యామి అంటే ఈ పరమేశ్వరుడు అన్నింటియందు అంతర్లీనంగా ఉంటూ, అన్నింటినీ నియంత్రిస్తుంటాడని చెబుతాడు.

ఆకాశంలో ఉంటాడు. ఆకాశమే అతడి శరీరం. ఆకాశం అతన్ని ఎరగదు. ఆకాశంలో ఉంటూనే ఆకాశాన్ని నియంత్రిస్తాడు. అతడే అంతర్యామి. అతడే ఆత్మ. అదే నువ్వు అని చెబుతాడు. ఈ రకంగా చరాచర జగత్తంతా వివిధ రూపాలలో వ్యాపించి ఉన్నది నేనే. నేను తప్ప ఇంకేదీ లేదు అనే విషయం ప్రత్యక్షానుభవంతో తెలియజేసేవాడు 'పరమగురువు'. స్థూలంగా చెప్పాలంటే శిష్యుడికి సన్మార్గాన్ని బోధించి తరుణోపాయం చూపేవాడు సద్గురువు.

# 3. సద్గురువు

గురువు సాక్షాత్తు పరమేశ్వరుడని గతంలో చెప్పుకున్నాం. పరమేశ్వరుడికి కులము, మతము, జాతి అనేవి లేవు. స్త్రీ, పురుష, నపుంసక బేధాలు అసలే లేవు. ఒకసారి ఒక ఉన్నత కులస్తుడు మంత్రం చెప్పుకోవాలి అని మంచి గురువు కోసం వెతకటం మొదలుపెట్టాడు. చివరకు వాళ్ళ ఊళ్ళోనే ఊరిచివరగా ఉన్న లంబాడీ పేటలో ఒక ముసలాయన ఈ విద్యలో మంచి నిష్ణాతుడు అని విన్నాడు. ఇంత బ్రతుకూ బ్రతికి చివరకు లంబాడీవాడి దగ్గర శిష్యరికం చెయ్యాలా? అని సందేహించాడు. ఆలోచిస్తున్నాడు. మధనపడుతున్నాడు. ఏదీ తేలలేదు. అతడా లంబాడీవాడు. విద్య అతడిదగ్గరే ఉన్నది. ఏం చెయ్యగలడు? చివరకు ఆయన దగ్గరకు వెళ్ళటానికే నిర్ణయించుకున్నాడు. బయల్దేరాడు. కాని మనసులో పీకుతూనే ఉంది. తీరా వెళ్ళేసరికి అతడి ఇల్లు, పరిసర ప్రాంతాలు, వాతావరణం అంతా చికాకుగా అనిపించింది. ఇంక అక్కడ ఉండలేకపోయాడు. తిరిగి వచ్చేశాడు. మంత్రం తీసుకోలేదు. ఈ రకమైన భావన పనికిరాదు. గురువు ఎటువంటివాడైనా సరే. అతడు గురువే. పరమేశ్వర స్వరూపమే.

శంకరాచార్యులవారు వెడుతున్నారు. త్రోవలో ఛండాలుడు కుక్కలను వెంట బెట్టుకుని ఎదురు వచ్చాడు. శంకరుల వారు వస్తున్నారు తప్పుకో, తప్పుకో అంటూ అరిచారు శిష్యులు. ఛండాలుడు అక్కడ ఆగి "ఎవర్ని తప్పుకోమంటున్నారు? ఈ శరీరాన్నా? ఆత్మనా? ఈ శరీరాన్నే అయితే నీ శరీరంలో ఉన్న రక్తమాంసాలే నా శరీరంలోనూ ఉన్నాయి. మరి ఆత్మనైతే నీ ఆత్మ, నా ఆత్మ అంతా ఒక్కటే. మరి ఎవరు తప్పుకోవాలి?" అని అడిగాడు. ఆ మాటలు విన్న శంకరుడు, ఆ వచ్చినవాడు సాక్షాత్తు ఆదిశంకరుడు. తనయొక్క అజ్ఞానాన్ని తొలగించటానికి ఈ రకంగా ఛండాలుడి రూపంలో వచ్చాడు అని తెలుసుకుని అతని కాళ్ళమీద పడతాడు. కాబట్టి గురువు దగ్గర కులము, మతము, జాతి అనేవి చూడరాదు. పరమేశ్వరుణ్ణే చూడాలి.

అలాగే గురువు వయస్సులో మనకన్న చిన్నవాడని, కులం తక్కువవాడని, ధనం తక్కువవాడని చిన్న చూపు చూడరాదు. మన అధికారము, దర్పము అతనిదగ్గర ప్రదర్శించరాదు. అలా చేసినవారికి గురుకటాక్షము ఉండదు. అతని దగ్గర నేర్చిన విద్య ఫలించదు. ఒక వ్యక్తిని గురువుగా ఎన్నుకున్న తరువాత, అతనిమీద

అపరిమితమైన భక్తి, గౌరవము, అభిమానము చూపాలి. అతని పాదాలకు నమస్కరించాలి. అతను చెప్పేది శ్రద్ధగా వినాలి.

ఒకసారి ఇంద్రుడికి బ్రహ్మజ్ఞానం తెలుసుకోవాలి అనిపించింది. రాజు తలచుకుంటే దెబ్బలకు కొదవా? పరివారాన్ని పంపించి లోకంలో బ్రహ్మ జ్ఞాని ఎవరో కనుక్కుని రమ్మన్నాడు. పరివారం అన్ని లోకాలు తిరిగారు. చివరకు భూలోకంలో "దధ్యుడు" అనే మహర్షి బ్రహ్మజ్ఞాని అని తెలుసుకున్నారు. అదే విషయాన్ని దేవరాజయిన ఇంద్రుడికి నివేదించాడు. సరే ఇంద్రుడు బ్రహ్మజ్ఞానం తెలుసుకోవటానికి దధ్యుడి దగ్గరకు బయల్దేరాడు. ఒక మహారణ్యం మధ్యలో చిన్న పర్ణశాల నిర్మించుకుని నివశిస్తున్నాడు దధ్యుడు. అతని ఆశ్రమానికి వచ్చాడు ఇంద్రుడు. సాక్షాత్తు దేవతల రాజైన ఇంద్రుడు తన ఆశ్రమానికి వచ్చాడు అని తెలియగానే దధ్యుడు ఎదురు వెళ్ళి స్వాగతం పలికాడు. అర్ఘ్యపాద్యాదులిచ్చి ఉచితాసనం మీద కూర్చోబెట్టాడు ఇంద్రుణ్ణి. కుశల ప్రశ్నలయిన తరువాత "దేవేంద్రా ! నువ్వు చాలా పెద్దవాడివి. దేవతలకు రాజువు. అటువంటి నీకు నాతో పని ఏమిటి? నా ఆశ్రమానికి విచ్చేసిన కారణం ఏమిటి? నేను నీకు ఏమి చెయ్యగలనో చెప్పవలసింది" అన్నాడు. ఆ మాటలు విన్న ఇంద్రుడు "మహర్షీ ! నేను నీ దగ్గర కొద్దిగా పని ఉండి వచ్చాను. అది నీవల్లనే కావాలి. 'నువ్వు తప్పకుండా ఆ పని చేస్తాను' అని మాట ఇస్తే, నేను వచ్చిన పని చెబుతాను" అన్నాడు. దానికి దధ్యుడు "దేవేంద్రా ! నువ్వు అడగటము, నేను కాదనటమా ? తప్పకుండా చేస్తాను. నీకేం కావాలో చెప్పు" అన్నాడు. అప్పుడు ఇంద్రుడు మెల్లిగా తాను వచ్చిన పని బయటపెట్టాడు. "నాకు బ్రహ్మజ్ఞానం కావాలి. అది నువ్వే చెప్పాలి" అన్నాడు. ఆ మాటలువిన్న దధ్యుడు ఒక్కసారిగా గతుక్కుమన్నాడు. వచ్చినవాడు ఇంద్రుడు. అపరిమితమైన భోగలాలసుడు. నిరంతరము అప్సరాంగనలతో క్రీడిస్తూ ఉంటాడు. ఇతడు అడిగేది సర్వసంగ పరిత్యాగులు కోరుకునే బ్రహ్మజ్ఞానం.

**యత్రాపి భోగోనచ తత్రమోక్షః । యత్రాపి మోక్షో నచ తత్ర భోగః** ఎక్కడ భోగం ఉంటుందో అక్కడ మోక్షం ఉండదు. ఎక్కడ మోక్షం ఉంటుందో అక్కడ భోగం ఉండదు. ఈ రెండింటికీ లంకె కుదరదు. ఇంద్రుడు పూర్తిగా భోగి. అలాటి వాడికి మోక్షకారకమైన బ్రహ్మజ్ఞానాన్ని ఉపదేశించటం ఎలా?

**నదేయం పరశిష్యేభ్యో నాస్తికేభ్యో నచేశ్వరీ**

పరశిష్యులు అంటే తనయందు నమ్మకంలేనివారు. అంతేకాని ఇతరుల శిష్యులు అని అర్థం కాదు. అలాగే నాస్తికులు అంటే వేదమునందు నమ్మకంలేనివారు. వీరికి వేదంగాని, మంత్రశాస్త్రంగాని, బ్రహ్మజ్ఞానంగాని చెప్పకూడదు అని శాస్త్రం చెబుతోంది. ఇక్కడ ఇంద్రుడికి వేదం అంటే నమ్మకముంది కాని భోగలాలసుడైన అతడికి, ఆ భోగాలు కేవలము క్షణికములని, అశాశ్వతములని చెప్పటం ఎలా? ఒకవేళ చెబితే అతడు వింటాడా? ఇంద్రుడు వచ్చిన పని ఏమిటో తెలుసుకోకుండానే అతని కోరిక తీరుస్తానని మాట ఇచ్చాడు తాను. ఇప్పుడతనికి బ్రహ్మజ్ఞానాన్ని వివరిస్తే అపాత్ర దానమవుతుంది. చెప్పకపోతే అసత్యదోషం అవుతుంది. ఏం చెయ్యాలి? ఏది దారి?" ఈ రకంగా ఆలోచిస్తున్నాడు. మళ్ళీ అడిగాడు ఇంద్రుడు "ఏం మహర్షీ! నాకు బ్రహ్మజ్ఞానం కావాలి. చెబుతావా? చెప్పవా?" ఈ సారి కూడా ఏం మాట్లాడలేదు దధ్యుడు. అలాగే మౌనంగా ఆలోచిస్తున్నాడు. మళ్ళీ ఇంద్రుడే అన్నాడు "మహర్షీ ! ఇందాక నా కోరిక తీరుస్తాను అని మాట ఇచ్చావు. మరి ఇప్పుడు ఏమిటి ఆలోచిస్తున్నావు? ఇంతకీ నాకు బ్రహ్మజ్ఞానం బోధిస్తావా? లేదా?" అన్నాడు. తాను ఇచ్చిన మాటను పట్టుకుని ఇంద్రుడు వత్తిడి చేస్తున్నాడు. చేయగలిగింది లేదు. అందుకని "సరే ! అలాగే చెబుతాను. రేపు ఉదయం నా శిష్యులతోబాటుగా రా !" అన్నాడు.

మరునాడు తెల్లవారింది. దైనందిన కార్యక్రమాలు ముగించుకుని కూర్చున్నాడు మహర్షి. శిష్యులు ఒక్కొక్కరే వచ్చి గురువుగారికి అభివాదం చేసి, ఆయనకు అభిముఖంగా కూర్చుంటున్నారు. వాళ్ళలో చివరగా ఇంద్రుడు వంటి మీద వస్త్రాలు, ఆభరణాలు అన్నీ తీసివేసి, గోచీ పెట్టుకుని, చేతితో దర్భలు పట్టుకుని వచ్చాడు. మహర్షికి నమస్కరించి, మిగిలినవారితో పాటుగా తనూ కూర్చున్నాడు. చెప్పటం మొదలుపెట్టాడు మహర్షి. "నాయనలారా ! ఈ జగత్తు అంతా మిథ్య. కంటికి కనిపించేది ఏదీ సత్యం కాదు. ఇదంతా అశాశ్వతమైనది. అంతా నశించేదే. ఈ జగత్తంతా ఒక భ్రమ. పదవులు, అధికారము, రాజ్యము అంతా భ్రమ. ఇక్కడ రాజ్యమూ లేదు అధికారము లేదు." ఇలా సాగిపోతోంది మహర్షియొక్క బోధ. ఒక్కసారిగా కోపం వచ్చింది ఇంద్రుడికి. ఇతడు చెప్పేదంతా తన గురించే. తాను ఇక్కడికి వచ్చాడని ఎద్దేవా చేస్తున్నాడు అనుకొని వెంటనే లేచి "మహర్షీ ! నువ్వు కావాలనే నన్ను అవమానిస్తున్నావు. కంటికి కనిపించేదంతా నిజం కాదు అంటున్నావు. రాజ్యం లేదు, అధికారం లేదు అంటున్నావు. ఈ మాటలన్నీ నన్ను ఉద్దేశించే చెబుతున్నావు ఇక్కడ లేనిది ఏమిటి? నా రాజ్యమా? నా అధికారమా ?

ఆ రెండూ ఉన్నాయే. నా అప్సరసలు, భోగాలు ఇవన్నీ నిజమే కదా! అయినా నువ్వు కావాలని ఇలా అబద్ధాలు చెబుతున్నావు. బ్రహ్మజ్ఞానం అంటూ మళ్ళీ ఇలాటి తప్పుడు మాటలు ఇంకెవరికైనా చెప్పావంటే నా వజ్రాయుధంతో నీ తల నరికి వేస్తాను జాగ్రత్త" అని హెచ్చరించి అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. ఇక్కడ చూడండి. ఇంద్రుడికి బ్రహ్మజ్ఞానం కావాలనే కోరిక ఉంది. కాని అందుకు తగిన అర్హత తనకుందా? లేదా? అని అతడెప్పుడూ లోచించలేదు. పైగా తాను దేవతలరాజును అని అతడికి అధికారదర్పం కూడా ఉన్నది. ఎంత మహర్షి అయినా దధ్యుడు ఒక మానవుడు అన్న చులకనభావం ఉన్నది. అతడిమీద గురుభక్తి లేదు. ఇలా ఉండరాదు. గురువు ఎలాటివాడైనా గొప్పవాడే అనే విషయం గుర్తుంచుకోవాలి.

**న గురోరధికం తత్త్వం న గురోరధికం తపః ।**
**తత్త్వ జ్ఞానపరం నాస్తి తస్మైశ్రీ గురవే నమః ॥**

గురువును మించిన తత్త్వము లేదు. మొత్తం తత్త్వాలు ఇరవై అయిదు. అసలు తత్త్వము అంటే – యదార్ధము, సత్యము, బ్రహ్మము, స్వభావము, సృష్టికి కారణమైనది అని అర్ధం. ఈ జగత్తు సృష్టించబడటానికి కారణమైనవి ఏవి? అని ప్రశ్నించి, తరచి చూడగా ఈ తత్త్వాలు బయటపడినాయి. ఈ తత్త్వముల వల్లనే చరాచర జగత్తంతా సృష్టించబడింది. అయితే ఈ తత్త్వాలను ఒక్కొక్క మతం వారు ఒక్కొక్క విధంగా చెప్పటం జరిగింది.

| | మతస్థులు | త॥ సంఖ్య | తత్త్వములు |
|---|---|---|---|
| 1. | బౌద్ధులు | 1 | శూన్యము |
| 2. | చార్వాకులు | 4 | నేల, నీరు, నిప్పు, గాలి |
| 3. | అర్హతులు | 2 | జీవము, అజీవము |
| 4. | ద్వైతులు | 2 | స్వతంత్రుడు, పరతంత్రుడు |
| 5. | విశిష్టాద్వైతులు | 3 | చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు |
| 6. | శైవులు | 3 | పశువు, పతి, పాశము |
| 7. | సాంఖ్యులు | 25 | పంచభూతాలు, తన్మాత్రలు, పదకొండు ఇంద్రియాలు, అవ్యక్తము, బుద్ధి, అహంకారము, ఆత్మ. |
| 8. | యోగులు | 26 | సాంఖ్యులు చెప్పిన 25, ఈశ్వరుడు |
| 9. | అద్వైతులు | 1 | బ్రహ్మము |

ఇప్పుడు తత్త్వము అంటే బ్రహ్మము అని చెప్పవచ్చు. గురువును మించిన తత్త్వము లేదు అంటే గురువును మించిన దైవం లేదన్నమాట. గురువు పరబ్రహ్మ కన్నా గొప్పవాడు. గురువును మించిన తపస్సు లేదు. తపస్సు అంటే మనోవాక్కాయ కర్మలచేత నిశ్చలమైన ధ్యానము. నిశ్చలమైన మనస్సుతో, మనసును ఏకాగ్రం చేసి గురువును ధ్యానిస్తే చాలు. సాధకుడి కోరికలు అన్నీ తీరిపోతాయి. గురువును ధిక్కరించి ఏ మంత్రానుష్ఠానం చేసినా, ఎన్ని సంవత్సరాలు. యుగాలు తపస్సు చేసినా ఉపయోగం లేదు. అందుకే మంత్రం చెప్పుకోబోయేముందు గురుత్రయం చెప్పుకోవాలి. గురుత్రయము అంటే గురువులు ముగ్గురు. 1. స్వగురువు – నీకు మంత్రం చెప్పినవారు. 2. పరమగురువు – నీ గురువు గారికి మంత్రం చెప్పినవారు. 3 పరమేష్ఠి గురువు – నీ పరమ గురువుకు మంత్రం చెప్పినవారు. మనకు మంత్రోపదేశం చేసిన గురువుగారు మాత్రమే కాదు. మనం మంచి పని ఏది చేసినా గురుపరంపర అంతా మన వెనక ఉంటుంది.

**ఆదినాథ సమారంభాం శంకర్యాచార్య మధ్యమాం ।**
**అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరాం ॥**

పరమాత్మ బిందురూపంలో ఉంటాడు. ఈ జగత్తును సృష్టించటంకోసం ప్రకాశ విమర్శాంశలుగా, కామేశ్వరీ కామేశ్వరులుగా తనను తాను విభజించుకున్నాడు. వీరే శివశక్తులు. ఇక్కడ శివశక్తులు అంటే మనం వేరుగా ఊహించవచ్చు. కాని ఇక్కడ శివుడు అంటే పురుషుడు. శక్తి అంటే ప్రకృతి. ఈ శివశక్తులే ప్రకృతి పురుషులు.

సృష్టి ఆవిర్భావ కాలంలో అంటే కృతయుగం ప్రారంభం అవుతున్న రోజులలో సర్వానందమయ చక్రము అనే ఓడ్యాణ పీఠమందు, పరమాత్మ స్వరూపుడైన పూర్ణ కామేశ్వరుడు "ఊర్ధ్వానందనాథ" అనే పేరుతో, అనుత్తరానందం కోసం, మాయా స్వరూపిణి, స్వాత్మరూప అయిన కామేశ్వరీ దేవికి శ్రీవిద్యను ఉపదేశించాడు. ఇక్కడ కామేశ్వరీ కామేశ్వరులిద్దరూ పరబ్రహ్మ స్వరూపులే. వారిద్దరికీ భేదం లేదు. ఆ ఇద్దరిలో ఎవరూ ఎక్కువకాదు, ఎవరూ తక్కువా కాదు. అయినప్పటికి లోకాలను అనుగ్రహించాలనే తలంపుతో, సత్సంకల్పంతో, పరమాత్మ తానే గురుశిష్యులుగా మారి, సర్వోపనిషత్సారభూతమైన శ్రీవిద్యాతంత్రాన్ని ఆమెకు ఉపదేశించాడు. ఈ రకంగా పరమాత్మ శ్రీవిద్యను లోకంలో వ్యాపింపచెయ్యటం కోసం తాను

"ఊర్ధ్వదేవనాథ", అనే దీక్షానామం ధరించి, కామేశ్వరీ దేవికి శ్రీవిద్యను ఉపదేశించి, ఆమెకు మిత్రేశ దేవనాథ (మిత్రేశ్వర్యంబ) అని నామకరణం చేశాడు. ఇప్పుడు కామేశ్వరీ కామేశ్వరులు ఊర్ధ్వదేవనాథ, మిత్రేశ్వర్యంబ అనే పేర్లతో సర్వానందమయమైన ఓడ్యాణ పీఠంలో పురాణ దంపతులుగా ఉన్నారు. ఇది శ్రీవిద్యకు మొదటి స్థానం. ఇదే పరబ్రహ్మ స్వరూపం అని మనం గుర్తుంచుకోవాలి. శివశక్తులు, ప్రకృతిపురుషులు, కామేశ్వరీ కామేశ్వరులు వీరిద్దరూ కలిస్తేనే పరబ్రహ్మ. ఆ పరమేశ్వరుడు ఈ జగత్తును సృష్టించటం కోసం తాను శివశక్తులుగా మారాడు.

ఆ తరువాత పరమేశ్వరుని ఆజ్ఞమేరకు, ఆ పరాభట్టారిక, శ్రీవిద్యా వ్యాప్తి కోసం తనయొక్క అంశలు, అవ్యక్త, మహత్తత్త్వ, అహంకార స్వరూపులు, సత్త్వరజస్తమోగుణ ప్రధానులు, సృష్టి స్థితి లయకారకులు, వాగ్భవ, కామరాజ, శక్తి బీజాధిపతులు అయిన త్రిమూర్తిద్వందానికి శ్రీవిద్యను ఉపదేశించింది. వారి ద్వారా ఉపదేశ పరంపరగా శ్రీవిద్య విస్తరించి దివ్యౌఘు, సిద్ధౌఘు, మానవౌఘు గురుమండలాలుగా లోకంలో ప్రసిద్ధి చెందింది. ఓఘము అంటే సమూహము అని అర్థం. దివ్యౌఘులు అంటే ఇంద్రాది దేవతలు. సిద్ధౌఘులు అంటే సనక, సనందన, సనత్కుమార, సనత్సు జాత మొదలైన వారు. మానవౌఘులు అంటే విద్యారణ్యులు, గౌడపాదులు, శంకరులు మొదలైనవారు.

బిందుమండలవాసిని అయిన ఆ కామేశ్వరీదేవి యోనిచక్రంలోని ఉత్తరకోణ మందు జాలంధర పీఠంలో ఉన్న శక్తి బీజాధిపతులైన ఉమామహేశ్వరులకు మొదట శ్రీవిద్యను ఉపదేశించి, వారికి ఊర్ధ్వదేవనాథ, కామేశ్వర్యంబ అని పేరు పెట్టింది. ఆ తరువాత ఊర్ధ్వదేవనాథ ద్వంద్వము యోనిచక్రంలోని దక్షిణ కోణమందు పూర్ణగిరి పీఠంలో ఉన్న కామరాజ బీజాధిపతులైన లక్ష్మీనారాయణులకు శ్రీవిద్యను ఉపదేశించి, వారికి షష్టీశ దేవనాథ, వజ్రేశ్వర్యంబ అని నామకరణం చేశారు. ఆ తరువాత షష్టీశనాథ ద్వంద్వము యోనిచక్రము యొక్క అగ్రకోణమందున్న కామగిరి పీఠంలో ఉన్న వాగ్భవ బీజాధిపతులైన వాణీ హిరణ్యగర్భులకు శ్రీవిద్యను ఉపదేశించి, వారికి మిత్రేశ దేవనాథ, భగమాలిన్యంబ అని నామకరణం చేశారు. శ్రీచక్రంలోని ఎనిమిదవ ఆవరణ అయిన త్రికోణంలో కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని పేర్లతో ఉన్న దేవతలు వీరే. ఈ రకంగా శ్రీవిద్య ఇంద్రాది దేవతలలో వ్యాప్తి చెందింది. వీరే దివ్యౌఘులు. ఆ తరువాత దేవతలద్వారా శ్రీవిద్య సిద్ధులైన సనక సనందనాదులకు ఉపదేశించ

బడింది. వారే సిద్ధౌఘులు. ఆ సిద్ధులనుంచి విద్యారణ్యులు మొదలైన మానవులకు వ్యాపించింది. వీరు మానవౌఘులు. ఈ రకంగా శ్రీవిద్య గురుపరంపరానుగతంగా భూలోకంలో వ్యాపించింది. శ్రీవిద్యయే కాదు. ఏ విద్య అయినా కూడా ఇదే విధంగా పరంపరానుగతంగా వ్యాపించిందే. అందుకే మంత్రజపం చేసేటప్పుడు శ్రీవిద్యకు మూలపురుషుడైన ఆదినాథుడి దగ్గర నుంచి, మనకు మంత్రం చెప్పిన గురువుదాకా, గురుపరంపరను మొత్తాన్ని స్మరించటం, వారందరికీ నమస్కరించటం జరుగుతుంది.

ఏదైనా ఒకపని చెయ్యాలని తలపెట్టినప్పుడు మనకి సంబంధించిన వాళ్ళే కాదు, ఆ పనికి సంబంధించిన వాళ్ళు కూడా మనకి పరిచయం లేకపోయినా సరే వచ్చి సాయం చేస్తారు. మనం ఏదైనా మంచి కార్యం తలపెడితే పవిత్రాత్మలన్నీ వచ్చి మనకు సాయం చేస్తాయి. అంతరారాధనపరులు, బ్రహ్మవాదులు జీవన్ముక్తులై ముల్లోకాలలోను సంచరిస్తుంటారు. వారంతా మనం చేసేపనికి బాసటగా నిలుస్తారు. అలాగే మన గురుపరంపర అంతా మనతోనే ఉండి ఆ కార్యం పూర్తి చేయిస్తుంది. ఇందులో సందేహం ఏ మాత్రములేదు. ఇంకా నమ్మకం కావాలి అంటే నన్నే ఉదాహరణగా తీసుకోవచ్చు. ఏ శాస్త్రము తెలియని నేను, ఏ పాండిత్యము తెలియని నేను ఇన్ని గ్రంథాలు వ్రాశాను అంటే, అది నా గొప్పదనం ఏ మాత్రమూ కాదు. నా గురుపరంపర నాకు అందించిన ప్రోత్సాహం, వారియొక్క కృపాకటాక్ష వీక్షణాలు. కాబట్టి **తత్త్వజ్ఞానపరంనాస్తి** గురువును మించిన తత్త్వములేదు. గురువును మించిన జ్ఞానము అంతకన్నా లేదు. ఆ గురువు ఎలాటివాడు అంటే -

**అఖండమండలాకారం వ్యాప్తయేన చరాచరం ।**
**తత్పదం దర్శితంయేన తస్మై శ్రీగురవే నమః ॥**

అఖండము - ఖండము కానటువంటి, ఒకటిగానే ఉన్నటువంటి, గొప్పదైనటువంటి మండలము-వృత్తము బిందువు, గుండ్రముగా నున్నది. మండలాకారము వృత్తాకారములో నున్నది, బిందురూపంలో ఉన్నది. **అఖండ మండలాకారం** పెద్దది అయిన వృత్తము లేదా బిందువు రూపంలో ఉన్నది. పరమేశ్వరుడు బిందురూపుడు. పరమేశ్వరుడు బిందురూపంలోనే ఎందుకున్నాడు? చతురస్రంగానో, దీర్ఘచతురస్రంగానో, అష్టకోణంగానో, ఇంకా ఏదైనా రూపంలో ఉండవచ్చును కదా. అంటే భూమి అనగా జగత్తు గుండ్రంగా ఉన్నది. ఆ జగత్తును పూర్తిగా ఆవరించే శక్తి

బిందువుకు మాత్రమే ఉంటుంది. మిగిలిన చతురస్రము, దీర్ఘచతురస్రము మొదలైన వాటికి ఉండదు. అదీగాక పెద్దగా విస్తరించే శక్తిగాని, సూక్ష్మంగా ఉండే శక్తిగాని ఒక బిందువుకు మాత్రమే ఉంటుంది. ఈ కారణంచేత పరమేశ్వరుడు బిందు రూపంలోనే ఉన్నాడు. అయితే బిందువు అంటే కేవలము గుండ్రంగా ఉండే వృత్తమా, లేకపోతే ఆ వృత్తం లోపల కూడా ఆవరించినదా? అనే ప్రశ్న వస్తుంది. బిందువు అంటే కేవలము గుండ్రంగా ఉండే వృత్తముకాదు. పెనంమీద వేసిన దోసె ఏ విధంగా అయితే ఉంటుందో, ఆ విధంగా ఉంటుంది. పరమేశ్వరుడు బిందురూపంలో ఉన్నాడు అంటే **'అణోరణీయాం । మహతోమహీయాం'** అణువుకన్న సూక్ష్మమైనవాడు, అదే విస్తరించినట్లైతే పెద్దవాటికన్నా కూడా పెద్దది అయినవాడు. అతడు ఈ జగత్తంతా ఆక్రమించి ఉన్నాడు. చరాచర జగత్తంతా ఆ పరమేశ్వరుని రూపమే. ఈ జగత్తును సృష్టించటం కోసం తనను తాను రెండుగా విభజించుకున్నాడు. అవే ప్రకృతి పురుషులు, కామేశ్వరీ కామేశ్వరులు, శివశక్తులు, వారే స్వాయంభువ మనువు, శతరూప. వీరివల్లనే ఎనభైనాలుగు లక్షల రకాలైన జీవరాశి పుట్టింది. అంటే ఈ జగత్తులో ఉన్నటువంటి ప్రతివస్తువు, ప్రతిజీవి ప్రాణమున్నవి ప్రాణము లేనివి, చలనమున్నవి చలనములేనివి. అన్నీ ఆ పరమేశ్వరుని ప్రతిరూపాలే. ఉదాహరణగా క్షీరసాగరమథనం చెబుతున్నప్పుడు చూడండి. క్షీరసాగరము తానే, మందరగిరి పర్వతము తానే, ఆ పర్వతానికి చుట్టిన వాసుకి తానే, పర్వతాన్ని మోసిన కూర్మము తానే, సాగరమథనం చేసిన దేవతలు తానే, రాక్షసులూ తానే. చివరకు క్షీరసాగరంలో నుంచి ఉద్భవించిన అమృతము తానే, హాలాహలమూ తానే. కాబట్టి ఈ జగత్తులో పరమేశ్వర స్వరూపము కానిది ఏదీలేదు. జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. అందుకే ఆ పరమేశ్వరుడు ఈ జగత్తంతా వ్యాపించి ఉన్నాడు అని చెప్పటం జరుగుతోంది. ఇదే గురుతత్త్వం. గురువు అంటే అఖండ మండలాకారుడు, చరాచర జగత్తు అంతా వ్యాపించినటువంటివాడు. **'తత్పదం దర్శితం యేన'** ఆయన యొక్క పాదాలను దర్శించాలి. అలా దర్శించినట్లైతే ఏమవుతుంది. గురువుగారిని ఎదురుగా కూర్చోబెట్టుకుని, వారి పాదాలను దర్శించవచ్చు. పాదాలకు నమస్కారం చెయ్యొచ్చు. కాని దర్శనము అంటే అలా కాదే. ధ్యానంలో కూర్చుని, ఆధారచక్రంలో నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని జాగృతం చేసి, దాన్ని సహస్రారానికి చేర్చి, అక్కడ గురుపాద పద్మాలను దర్శించాలి. అదే పరమాత్మ దర్శనం. స్వస్వరూప దర్శనం. అలా

దర్శించినవాడికి మోక్షమార్గం దొరుకుతుంది. జన్మరాహిత్యానికి దారి ఏర్పడుతుంది. అందుకే **తస్మైశ్రీ గురవే నమః** అటువంటి గురువుకు నమస్కారము అంటే పరబ్రహ్మ స్వరూపుడైన గురువుకు నమస్కరిస్తున్నాను. అటువంటి గురువు శిష్యునియొక్క అజ్ఞానము అనే చీకటిని పారద్రోలి, జ్ఞానజ్యోతులను వెలిగిస్తాడు. మోక్షమార్గాన్ని చూపిస్తాడు.

అయితే అలాటి సద్గురువు ఏ విధంగా లభిస్తాడు? సాధకుని యొక్క కర్మఫలాన్ని బట్టి గురువు లభించటం జరుగుతుంది. గతజన్మలో సాధన ఎంతవరకు చేసి ఆపేశామో, అక్కడ నుంచి ఈ జన్మలో మొదలవుతుంది. అతడికి పూర్వజన్మ జ్ఞానం ఉంటుంది. తాను చేసిన తప్పులూ అతడికి తెలుస్తాయి. సాధనా విధానమూ గుర్తుంటుంది. దీనికి ఉదాహరణగా '**జడభరతుడు**'లాంటి కథలు అనేకం చెప్పచ్చు. ఈ కారణంచేతనే కొందరు మహానుభావులు పుడుతూనే గొప్పవాళ్లవుతారు. మహాజ్ఞానులవుతారు. అందుచేత మనం చేసిన కర్మను బట్టి (సాధననుబట్టి) గురువు లభించటం జరుగుతుంది. గురువుకోసం కొంతమంది దేశం అంతా తిరుగు తుంటారు. అడవుల వెంబడి, గుహల వెంబడి పడి వెతుకుతుంటారు. వాళ్ళకు సద్గురువును పొందే స్థాయి లేదన్నమాట. వాళ్ళలా ఎంతకాలం వెతికినా ప్రయోజనం ఉండదు.

అటువంటి వారిని చూసే వేమన **"గురువును వెతుకుచూ గుహలోకి పోవగా మృగమొకండు తారసిల్లిన గురువు కన్న ముక్తి ముందుగా చూపురా"** అంటూ వెక్కిరించాడు.

ఈ రకంగా గురువును అన్వేషిస్తూ తనువు చాలించిన వారెందరో ఉన్నారు. కొందరికి మంచి గురువు చాలా తేలికగా దొరుకుతాడు. మరికొందరిని ఆ గురువే వెతుక్కుంటూ వస్తాడు. శంకరాచార్యులవారినే చూడండి. కాలడి నుంచి బయలుదేరి వస్తున్నాడు. మార్గమధ్యంలో నర్మదానదికి వరద వచ్చి ఊరంతా ముంచివేస్తోంది. జనం హాహాకారాలు చేస్తున్నారు. చూశాడు శంకరుడు. నర్మదానదిని తన కమండలంలోకి ఆవాహన చేశాడు. కమండలంలో బంధించేశాడు. నర్మదా నది వద్దున 'గోవిందపాదాచార్యుడు' నివసిస్తున్నాడు. వ్యాసభగవానుడు ఒకసారి గోవిందపాదుడికి దర్శనమిచ్చి, నర్మదా నదిని తన కమండలంలో బంధించగలవాడు నీకు శిష్యుడవుతాడు. అతడే బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాస్తాడు అని చెప్పాడు. ఆ

మాటలు గుర్తు వచ్చి, తనకు తగిన శిష్యుడు దొరికాడు అని ఆనందంగా పరుగు పరుగున వచ్చాడు శంకరుడి దగ్గరకు. ఇదే విధంగా వివేకానందుడికి రామకృష్ణ పరమహంసలాగా మంచి గురువు లభ్యం కావటమనేది జన్మజన్మల పుణ్యఫలం. మనకి మంచి గురువు దొరకలేదు అంటే మన కర్మ పరిపక్వం కాలేదు అని గుర్తించాలి.

## 4. అహంకారం పనికిరాదు

ఒకచోట సభ జరుగుతోంది. ఆ సభకి ఒక స్వామిజీ విచ్చేశారు. వారి ప్రవచనం పూర్తయింది. అందరికీ ఆశీస్సులు అందించారు. సభ పూర్తయింది. అది వేసవికాలం 'మే' నెల ఎండలు బాగా మండుతున్నాయి. సభ జరిగింది సాయంత్రమే అయినా వాతావరణ చల్లబడలేదు. పైన ఫ్యాను తిరుగుతోంది కాని వేడిగాలి వస్తోంది. అందుకని స్వామిజీ వేదిక నుంచి దిగి, ఆరుబయట కుర్చీలో కూచున్నారు. జనం అంతా వచ్చిన నమస్కారం చేసి ఆశీర్వాదం తీసుకుంటున్నారు. కొందరు తమ కష్టాలు వారికి చెప్పుకుంటున్నారు. స్వామిజీ వారి కష్టాలను ఓపికగా వింటున్నారు. వారందర్నీ ఓదారుస్తున్నారు. ఇంతలో ఒక వ్యక్తి వచ్చాడు. అతడికి పాతిక సంవత్సరాలదాకా వయసుంటుంది. వేషం, భాష అన్నీ బాగానే ఉన్నాయి. అతని తండ్రి యూనివర్శిటీలో ప్రొఫెసరు. ఆయన శ్రీచక్రంమీద పుస్తకం వ్రాశారు. ఆ పుస్తక ఆవిష్కరణ కోసమే ఈ సభ జరిగింది. ఈ వ్యక్తి ఆ గ్రంథకర్తగారి కుమారుడు. యం.బి.ఎ. చదివి మంచి ఉద్యోగమే చేస్తున్నాడు. నేను అక్కడికి వచ్చేసరికి ఈ వ్యక్తి స్వామిజీ దగ్గర వెళ్ళి గొంతుక్కూర్చుని, స్వామిజీ కూర్చున్న కుర్చీ చెయ్యి పట్టుకుని వెనక్కి ముందుకూ ఊగుతూ, నవ్వుతూ, ఏదో ఒక స్నేహితుడితో మాట్లాడినట్లుగా సరదాగా మాట్లాడుతున్నాడు. పోనీ అతనికి స్వామీజీతో పూర్వపరిచయం కూడా ఏమీ లేదు. ఇవతల ఉన్నవాళ్ళు మాత్రం చెవులు కొరుక్కుంటున్నారు. అతను అలా చేస్తాడేమిటి? స్వామిజీ అంటే గురువుగారు కదా! గురువుగారి దగ్గర ఆ విధంగా ప్రవర్తించవచ్చా? ఇదీ వాళ్ళ గొణుగుడికి అర్థం. అతనలా చేస్తుంటే స్వామిజీ ఏమీ అనరేమిటి? అతడికి గురువుగారి మీద భక్తి, శ్రద్ధ, గౌరవము కనిపించటం లేదు కదా? ఇది మిగిలిన వాళ్ళ భావన.

ఇలా చెయ్యటం తప్పు. ముమ్మాటికీ తప్పు. స్వామిజీ మనకన్న గొప్పవాడని, భగవదంశ సంభూతుడని కదా మనం ఆయన్ని పిలిచింది. ఆయన్ని అక్కడ గురువుగా

పూజిస్తున్నాము. ఆయన ఇచ్చే బోధనలు, ఉపదేశాలు గురూపదేశంగానే స్వీకరిస్తున్నాం. కాబట్టి ఆయన కూడా మనకి గురువే. స్వామిజీని పిలిచినప్పుడు వారిని ఒక కుర్చీలో కూర్చోబెట్టి, మిగిలిన కుర్చీలలో మనం కూర్చుంటాం. అది తప్పు. గురువు దగ్గర ఆయనతో సమానమైన ఆసనంలో మనం కూర్చోరాదు. ఆయన కుర్చీలో కూర్చుంటే మనం క్రింద కూర్చోవాలి. లేదా వారికి పెద్ద కుర్చీ ప్రత్యేకంగా వేయించి వారి ఉన్నత స్థితిని చాటాలి. వారు వచ్చినప్పుడు అనన్యమైన భక్తి ప్రపత్తులతో సగౌరవంగా వారిని ఆహ్వానించాలి. వారితో మనకి పరిచయం ఉన్నది కదా అని సరదాగా మాట్లాడరాదు. కొంతమంది చెబుతుంటారు. "నేను ఊర్కోనండి, స్వామిజీని గట్టిగా అడిగేస్తాను. ఆయనతో దెబ్బలాడేస్తాను" ఇవన్నీ కూడని పనులు. నువ్వెంత గొప్పవాడివైనా సరే, గురువుగారి దగ్గరకెళ్ళినప్పుడు, వారి పాదాలకు సాష్టాంగదండ ప్రణామం చెయ్యాలి. 'సాష్టాంగము' అంటే ఎనిమిది అంగములు నేలకు తగిలేటట్లుగా నేలమీద బోర్లా పడుకుని నమస్కారం చెయ్యటం, ఏమిటి ఈ ఎనిమిది అంగాలు?

**జానుభ్యాం చ తథాపద్భ్యాం పాణిభ్యా మురసాధియా ।**
**శిరసా వచసా దృష్ట్యా ప్రణామోష్టాంగ ఈరితః ॥**

జానువులు – మోకాళ్ళు, పద్భ్యాం – పాదాలు, పాణిభ్యాం – చేతులు, ఉరసా – రొమ్ము, ధియా – బుద్ధి, శిరసా – శిరస్సు, వచసా – వాక్కు, దృష్ట్యా – చూపు.

కాళ్ళు (మోకాళ్ళు, పాదాలు) చేతులు, రొమ్ము, శిరస్సు నేలకు ఆనేటట్లుగా బోర్లా పడుకుని, బుద్ధి, చూపు, వాక్కులను కేంద్రీకరించి, వారి పైనే దృష్టి నిలిపి నమస్కరించటం. అంటే **"త్వమేవ శరణం మమ"** మనసా వచసా నీవే నాకు దిక్కు అని దాసోహమవటం. ఈ రకంగా నమస్కరించాలి. గురువు మనకు బాగా పరిచయం ఉన్నవాడు కావచ్చు, మన చుట్టం కావచ్చు, లేదా సొంత కుమారుడైనా కావచ్చు, కులహీనుడు కావచ్చు. కాని ఆయన "గురువు" అనే మాట మర్చిపోరాదు. గురువు మీద అపరిమితమైన నమ్మకం ఉండాలి. ఆయన చెప్పిన దాన్ని ఆజ్ఞగా శిరసా వహించాలి. ఆయనను ఎప్పుడూ స్వామీ ! దేవా ! అనే సంబోధించాలి. ఇవే మాటలు ఇక్కడ చెబుతున్నారు చూడండి.

**శ్రీగురుమూర్తిని చేరినంతనే నమస్కారంబు ముందుగా సలుపవలయు**
**లజ్జాభిమానకులంబువీడి పాదచారియై సద్భక్తి చేరవలయు**

**సుతుడైన హితుడైన సోదరుడైన కులహీనుడైనను గొలువవలయు**
**గురువాజ్ఞ వర్తించి గురుడిచ్చు తృణమైన మేరువుగా నెంచి మెలగవలయు**
**గురుని ప్రభువటంచు స్వామి దేవరయటంచు**
**బిలుచుచును లోభగుణముల దొలచవలయు**

అంతేకాదు గురువుగారు వచ్చినట్లైతే మనం కూర్చోకూడదు. ఆయన కూర్చున్న తరువాతనే మనం కూర్చోవాలి. గురువుగారు తినకుండా మనం తినరాదు. గురువును ఎట్టి పరిస్థితులలోను నిందించకూడదు. ప్రక్కవాళ్ళెవరైనా ఆయన్ని నిందిస్తుంటే, వాళ్ళతోపాటే మనం కూడా నిందించరాదు. ఆ నిందావాక్యాలు శిష్యుడు వినను కూడా వినరాదు. గురువుకు ఇష్టంలేని పనులు చెయ్యరాదు. గురువు ఏదైనా చెబితే, దాన్ని ఆజ్ఞగా పాటించాలి. ఆయన చెబితే వినాలి. లేకపోతే అక్కడే కూర్చోవాలి. ఒకవేళ ఆయన ఏమీ చెప్పకపోతే, చెప్పమని అడగరాదు.

**గురుమూర్తి వచ్చుచో గూర్చుండగారాదు. గురుశిష్యులొక శయ్య కూర్కరాదు**
**ముందుగా తనయంత భుజింపగా రాదు పారి దొంగద్రోవల బోవరాదు**
**గురునింద వినరాదు కూడి చేయగరాదు**
**గురుని కప్రియమును గూర్చరాదు.**
**సద్గురు విడిన శాసనము మీరగరాదు, హెచ్చిదా గురుని శాసింపరాదు**
**గురుడు బోధించనెంచిన అరుగరాదు (వెళ్ళిపోరాదు)**
**అతడు బోధింపకుండిన అడుగరాదు.**

ఈ విధంగా గురువును సేవించి ఆయన యొక్క కృపాకటాక్ష వీక్షణాలు పొందాలి. 'గురువు' అంటే అపారమైన నమ్మకం ఉండాలి. గురువుగారి మీద విశ్వాసం ఉండాలి. పూర్వకాలంలో బ్రహ్మవేత్త అయిన ఋషీశ్వరుడు ఉండేవాడు. అతని దగ్గర అనేకమంది శిష్యులు ఉండేవారు. ఆ శిష్యులలో ఇద్దరికి ఆకాశగమనం చెయ్యాలనే కోరిక కలిగింది. ఈ మాట బయటకు చెబితే మిగిలినవాళ్ళు నవ్విపోతారనే భావంతో మౌనంగా ఉండిపోయారు. ఒకరోజున గురువుగారిని ఏకాంతంగా కలిసి వారియొక్క కోరికను వివరించారు. గురువుగారు చిరునవ్వు నవ్వి వాళ్ళకి విడివిడిగా మంత్రోపదేశం చేశారు. శిష్యులు ఒకరికి తెలియకుండా ఒకరు ఆ మంత్రజపం చేశారు. మంత్రం సిద్ధించింది. వారి కోరిక నెరవేరింది. ఇద్దరు ఒకరికి తెలియకుండా

మరొకరు ఆకాశంలో విహరిస్తున్నారు. కొంత కాలం గడిచింది. ఆకాశమార్గంలో ఇద్దరూ ఎదురుపడ్డారు. చాలాకాలం తరువాత పిచ్చాపాటీ మాట్లాడుతున్నారు ఇంతలో మొదటివాడికి ఏదో అనుమానం వచ్చి రెండవ వాడితో "నువ్వు ఆకాశగమనం చేస్తున్నావు కదా ! నీకు ఈ శక్తి ఎలా వచ్చింది? గురువుగారు నీకు ఏ మంత్రం చెప్పారు?" అని అడిగాడు. దానికి రెండవవాడు "ఆఁ ! అదేం పెద్ద మంత్రం కాదు 'కా' అని జపం చెయ్యమన్నారు. చేశాను. ఏదో నా గీత బాగుండి నాకు ఈ శక్తి వచ్చింది. అది సరే. మరి నువ్వూ ఆకాశగమనం చేస్తున్నావు కదా ! మరి గురువుగారు నీకే మంత్రం చెప్పారు?" అని అడిగాడు. దానికి మొదటివాడు "ఆఁ ! నాదీ పెద్ద మంత్రం ఏమీ కాదు. నీకు చెప్పినట్లుగానే నన్ను 'కీ' అనమన్నారు. దాన్నే జపం చెయ్యమన్నారు. సరే చేశాను. నా అదృష్టం బాగుండి నాక్కూడా ఈ శక్తి వచ్చింది. ఇందులో గురువుగారి గొప్పతనం ఏమీలేదు" అన్నాడు. ఆ మాటలువిన్న రెండవవాడు "ఓస్ కా, కీ ఇదే మంత్రం అని తెలిస్తే ఈ పాటికి ఎప్పుడో ఈ శక్తిని సాధించేవాళ్ళం. దీనికి ఈ గురువుగారెందుకు?" అన్నాడు. 'ఔను' అన్నాడు మొదటివాడు. అంతే, ఆ మరుక్షణంలోనే వారిద్దరూ ఆకాశంలోంచి నేలమీద పడిపోయారు.

గురువుగారిచ్చిన మంత్రంవల్ల, ఆయన శక్తివల్ల వీరు ఆకాశగమనం చేస్తున్నారు. ఇప్పుడు ఆ గురువుమీద వీరికి నమ్మకం పోయింది. ఆకాశగమనం తమ అదృష్టంవల్ల వచ్చిందే కాని, గురువుగారి శక్తివల్ల కాదు అనుకున్నారు. గురుధిక్కారం జరిగింది. శిష్యులు పతనమై పోయారు. ఆకాశంలోంచి జారి క్రింద పడ్డారు.

అలాగే గురువుగారికి అబద్ధం చెప్పకూడదు. మోసం చేసి విద్యను నేర్చుకో కూడదు. ఈ విషయం గురువుగారికి తెలిసిన మరుక్షణం తీవ్రమైన పరిణామాలు జరుగుతాయి. దీనికి కర్ణుడి కథే ఉదాహరణ. సూర్యుడియొక్క అంశతో కుంతీదేవికి చిన్నతనంలోనే పుట్టినవాడు కర్ణుడు. ఆ బాలుణ్ణి నదిలో వదలివేసింది కుంతి.

ఆ నదిలో 'అతిరథుడు' అనే సూతుడికి దొరికాడు ఈ పిల్లవాడు. అతడికి పిల్లలు లేరు. ఆ కారణం చేత అతని భార్య ఈ పిల్లవాణ్ణి చాలా ప్రేమతో పెంచింది. క్రమంగా పెద్దవాడయ్యాడు కర్ణుడు. బ్రహ్మాస్త్రము, భార్గవాస్త్రము నేర్చుకోవటానికి పరశురాముడి దగ్గరకి శిష్యుడుగా వెళ్ళి, తనను బ్రాహ్మణ బాలుడిగా చెప్పుకున్నాడు. ఆ అస్త్రాల ప్రయోగ ఉపసంహారాలు నేర్చుకున్నాడు. ఒకరోజున పరశురాముడు కర్ణుని తొడమీద తలపెట్టుకుని నిద్రిస్తున్నాడు. ఆ సమయంలో ఒక కీటకము కర్ణుని

తొడను తొలిచివేసింది. అయినా సరే కాలు కదిపితే గురువుగారికి నిద్రాభంగం అవుతుందని అలాగే భరించాడు కర్ణుడు. రక్తం బాగా కారిపోయింది. పరశురాముడు లేచి ఈ రక్తం చూసి, విషయం తెలుసుకుని కర్ణుని గురుభక్తికి మెచ్చుకున్నాడు. కాని అతడికి అనుమానం వచ్చింది. బ్రాహ్మణుడు ఈ రకంగా బాధని భరించలేడు. నువ్వెవరో నిజం చెప్పు అన్నాడు. తాను సూతపుత్రుణ్ణి అని చెప్పాడు కర్ణుడు. జరిగిన మోసం తెలిసింది పరశురాముడికి. మోసంతో కర్ణుడు తనదగ్గర విద్య నేర్చుకున్నాడు. కాబట్టి అవసరమైన సమయంలో నీకు బ్రహ్మాస్త్రం అక్కరకు రాదు అని శపించాడు. కర్ణుడు పడ్డ శ్రమంతా వృధా అయింది. అందుకే గురువును ఎప్పుడూ మోసం చెయ్యకూడదు.

గురువుగారు "మహాజ్ఞాని" అని మరచిపోరాదు. శాస్త్రపాండిత్యమున్నవాడు పండితుడు కాని జ్ఞాని అలా కాదు. అతనికి అన్ని విషయాలు తెలుసు. ఏదీ చదవవలసిన అవసరం లేదు. అందుకే గురువు మహాజ్ఞాని అని మరచిపోకూడదు. షిరిడీ సాయిబాబా దగ్గరకు 'నానాసాహెబ్ చాందోర్కర్" అని ఒక వ్యక్తి వస్తుండేవాడు. అందరూ అతన్ని 'నానా' అని పిలిచేవారు. అతను బాగా చదువుకున్నవాడు. మంచి పండితుడు. అయితే తాను పండితుణ్ణి అనే అహంకారం మాత్రం అతనికి ఉన్నది.

ఒకరోజున బాబా విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో నానాపాదాలు వత్తుతున్నాడు. అలా వత్తుతూ భగవద్గీతలోని నాల్గవ అధ్యాయంలోని ముప్పైనాల్గవ శ్లోకం నోటిలోనే అనుకుంటున్నాడు. అది కొద్దికొద్దిగా బయటకు వినిపిస్తోంది. అయితే తాను బాబాను ఆరాధిస్తున్నాడు కాని, బాబాకు తనకున్నంత భాషా పరిజ్ఞానము, పాండిత్యము లేవు అని నానా నమ్మకం. ఆ సమయంలో బాబా "ఏమిటి నానా ? నీలో నువ్వే గొణుక్కుంటున్నావు" అన్నాడు. ఆ మాట విన్న నానా "ఆ c ! ఏదో భగవద్గీత లెద్దురూ" అన్నాడు. ఆ సమాధానంలో "నేను చెప్పినా మీకు అర్థంకాదు. మీకు తెలుసా ? చచ్చా?" అన్న తృణీకారం ఉంది. ఆ మాటలు విన్న బాబా "పోనీలే ! నాకూ చెప్పు. నేనూ వింటాను" అన్నాడు. మాట దాట వెయ్యటానికి చూశాడు నానా. వదల్లేదు బాబా. బాగా రెట్టించి అడిగాడు. ఇక చేసేది లేక నానా శ్లోకాన్ని గట్టిగానే చెప్పాడు.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వ దర్శినః ॥

అర్జునా ! నువ్వు తత్త్వాన్ని దర్శించిన జ్ఞానుల దగ్గరకు వెళ్ళి, ఆ జ్ఞానాన్ని గ్రహించు. వారికి నమస్కారం చెయ్యటంవల్ల, సేవలు చెయ్యటంవల్ల, ప్రశ్నలు అడగటం వల్ల, వారు కరుణించి నీకు పరమాత్మ తత్త్వాన్ని ఉపదేశిస్తారు అన్నాడు కృష్ణుడు. ఆ శ్లోకం విన్న తరువాత బాబా అడుగుతున్నాడు. నానా ! 'ప్రశ్నేన' అంటే అర్థం ఏమిటి? 'ప్రశ్నించటము' సమాధానం చెప్పాడు నానా. మరి 'పరిప్రశ్నేన' అంటే ? మళ్ళీ అడిగాడు బాబా. ఒక్క క్షణం ఆలోచించి ప్రశ్నేన అన్నా పరిప్రశ్నేన అన్నా ఒకటే అర్థం చెప్పాడు నానా, రెండింటికీ ఒకటే అర్థం అయితే 'ప్రశ్నేన' అనే దానికి 'పరి' అనే ప్రత్యయాన్ని ఎందుకు చేర్చాడు? అడిగాడు బాబా. ఆ ప్రశ్నకు కొంచెం తడబడ్డాడు నానా. చివరకు తెలియదు అని సమాధానం చెప్పాడు. ఇప్పుడు మళ్ళీ బాబాయే అంటున్నాడు. "పోన్లే దాన్ని వదిలెయ్యి. శ్రీకృష్ణుడు స్వయంగా తానే జ్ఞాని, గురువు అయి ఉండి కూడా అర్జునుడికి ఇతర జ్ఞానులను, గురువులను సేవించమని ఎందుకు చెప్పాడు?" అన్నాడు. వెంటనే "ఔను సుమా ! ఇంతవరకు నాకీ అనుమానం రానే లేదు" అన్నాడు నానా. బాబా చిరునవ్వుతో "నానా ! నేనంటే యేదో యాథాలాపంగా బాబానయి పోయాననుకో. మరి నువ్వేమో చాలా శాస్త్రాలు, భాష్యాలు చదివిన పండితుడివి కదా. కొంచెం నా అనుమానం తీర్చరాదూ" అన్నాడు బ్రతిమాలుతున్నట్లుగా. ఆ మాటలు విన్న నానాకు విషయం అర్థమైంది. అతనిలోని అహం ఎగిరిపోయింది. తనను క్షమించమని బాబా పాదాలను పట్టుకున్నాడు. అప్పుడు బాబా అతనితో "నానా ! సర్వ అనర్థాలకూ అహంకారమే మూలము. మనకి తెలుసు అనే అహంకారంవల్లనే చాలా విషయాలు తెలుసుకోవటం మానేస్తున్నాం. ఇక్కడ కావలసినది పాండిత్యం కాదు పరమార్థం" అంటూ హితబోధ చేస్తూ గీతలోని జ్ఞానయోగ రహస్యాలను నానాకు వివరించాడు.

గణపతి సచ్చిదానంద స్వామి వారి దగ్గరకు 'బాలగణపతి భట్టు' అని ఒకాయన వస్తూ ఉండేవాడు. భట్టుగారు మంచి పండితుడు. బహుగ్రంథకర్త. తాను గొప్ప పండితుణ్ణి అని కొద్దిగా 'అహం' ఉండేది. ఒకసారి స్వామిజీ భట్టుగారితో "భట్టుగారూ! ఎవరో ఆధ్యాత్మిక సంస్థవారు ఒక సావనీరు ప్రచురిస్తూ నన్ను ఒక వ్యాసం పంపమన్నారు. నాకేమో సంస్కృతం రాదు. నేను వ్యాసం పంపకపోతే నాకు సంస్కృతం రాదు అని వాళ్ళకి తెలిసిపోతుంది. కాబట్టి మీరే ఒక వ్యాసం వ్రాసి పెట్టండి. దాన్ని నా పేరుతో పంపుతాను" అన్నారు. ఆ మాటలు విన్న భట్టుగారికి స్వామిజీ మీద గౌరవం చాలా తగ్గిపోయింది. అయినా పోన్లే అని వ్యాసం వ్రాశాడు.

స్వామిజీ దగ్గరకు బయల్దేరుతూ, ఆ వ్యాసంయొక్క సారాంశమంతా ఒక శ్లోకంలో వ్రాశాడు. భట్టుగారు ఆశ్రమానికి వెళ్ళేటప్పటికి స్వామిజీ ఎవరితోనో మాట్లాడుతూ ఒక శ్లోకం చెప్పి వివరిస్తున్నారు. ఆ శ్లోకం తాను ఎక్కడో చదివినట్లుంది. ఎక్కడబ్బా? అని బాగా ఆలోచించాడు. గుర్తొచ్చింది. ఇందాక తాను వ్రాసిన శ్లోకం అదే. ఇంకా తన చేతిలోనే ఉంది. ఆశ్చర్యపోయాడు భట్టుగారు. కాని ఆయనకు జ్ఞానోదయం కలగలేదు.

ఒకసారి భట్టుగారితో "భట్టుగారూ ! 'భక్తిమాల' పత్రికలో నా మహిమ గురించి ఒక వ్యాసం వ్రాయండి. ఎవరో విదేశీయులకు నేను రోగం తగ్గించినట్లు, వాళ్ళు నాకు శిష్యులైనట్లు వ్రాయండి. ఏదో దేశంపేరు పెట్టండి. ఎవడు చూడొచ్చాడు" అన్నారు స్వామి. ఆ మాటలు విన్న భట్టుగారు చాలా బాధపడ్డారు. సరే ఏం చెయ్యలేక ఒక వ్యాసం వ్రాశాడు. వూల్ఫ్‌గాంగ్, మార్గరేట్ జర్మనీ దంపతులు. వాళ్ళ అమ్మాయి 'వరానా' పదమూడు సంవత్సరాల పిల్ల. ఆ పిల్లకి ఎక్కడైనా దెబ్బ తగిలి రక్తం వస్తే ఆగదు. చాలా దేశాలు తిరిగారు. ఎక్కడా ఈ రోగం తగ్గలేదు. చివరకు స్వామిజీ దగ్గరకు వచ్చారు. వీరిచ్చిన విభూదితో ఆ రోగం తగ్గిపోయింది. వాళ్ళు ఈయనకు శిష్యులైనారు. ఇది ఆ వ్యాసం సారాంశం.

ఆ మరునాడు భట్టుగారు ఆ వ్యాసాన్ని స్వామిజీ దగ్గరకు తెచ్చాడు. లోపల ఎవరితోనో మాట్లాడుతున్నారు స్వామిజీ. బయటే కూచున్నాడు భట్టుగారు. అక్కడ ఎవరో విదేశీయులు కనిపించారు. ఊసుపోక వాళ్ళతో మాట్లాడాడు భట్టుగారు. వాళ్ళది జర్మని. ఆయన పేరు వూల్ఫ్‌గాంగ్. ఆవిడ మార్గరేట్. వాళ్ళమ్మాయి 'వరానా' ఆ పిల్లకి దెబ్బ తగిలితే రక్తం ఆగదు. ఎంతోమంది డాక్టర్ల దగ్గరకు వెళ్ళారు. ఎంతో డబ్బు ఖర్చు చేశారు. కాని రోగం మాత్రం తగ్గలేదు. చివరకు స్వామిజీని కలిశారు. ఒక్క విభూది పొట్లంతో రోగం తగ్గిపోయింది. కృతజ్ఞతలు చెప్పి పోదామని వచ్చారు. అంతా తాను వ్రాసిన కథే. అవాక్కై పోయాడు భట్టుగారు. ఇంతవరకు తాను పండితుణ్ణి. తనకు అనేక విషయాలు తెలుసు అనే అహం ఉండేది. ఇప్పుడు అది కాస్తా పటాపంచలై పోయింది. జ్ఞానజ్యోతులు వెలిగాయి.

గురువు అంటే సామాన్యమైన వ్యక్తి కాదు. సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపం. ఆయన కృపాకటాక్ష వీక్షణాలుంటే ఏదైనా సాధించవచ్చు. అందుకే శిష్యుడు ఏ రకమైన అహంకారాన్ని గురువు దగ్గర ప్రదర్శించరాదు.

## 5. శిష్యుడికి పరీక్ష

ఎవరైనా వచ్చి 'నాకు మంత్రోపదేశం చెయ్యండి, బ్రహ్మజ్ఞానం వివరించండి' అంటే వెంటనే చెప్పడు ఏ గురువూ కూడా. అసలు ఆ వచ్చిన వాడికి మంత్రం చెప్పుకోతగ్గ అర్హత ఉన్నదా? అతడు ఆ మంత్రజపం చేస్తాడా? మంత్రసిద్ధి జరిగితే అతడు ఆ శక్తిని దేని కోసం వినియోగిస్తాడు. అతనిలో తమోగుణం ఎంతవరకు ఉన్నది? రజోగుణం ఎంతవరకు ఉన్నది? అనే విషయాలు బాగా పరిశీలించి, తాను తృప్తి చెందితేనే అతణ్ణి శిష్యుడిగా స్వీకరిస్తాడు.

పూర్వకాలంలో ఒక ఊరిలో ఒక గురువు గారుండేవాడు. ఆయన మహా మంత్రవేత్త అని చుట్టుప్రక్కల ఊళ్ళవాళ్ళంతా కూడా చెప్పుకునేవారు. ఆయన చాలా మంచి స్వభావం గలవాడు. ఎవరికి ఏ కష్టం వచ్చినా ఆయన చాలా బాధపడేవాడు. తనకు చేతనైన సాయం చేసేవాడు. ఒక రోజున ఆయన దగ్గరకు ఒక వ్యక్తి వచ్చి తనకు మంత్రోపదేశం కావాలని అడిగాడు. అతని వాలకం చూస్తే, అతడు క్రమం తప్పకుండా మంత్రజపం చేస్తాడా ? అన్న అనుమానం కలిగింది గురువుగారికి. సరే చూద్దాం అనుకుని పంచాంగం చూసి పదిరోజుల తరువాత, పదకొండవరోజు ఉదయాన్నే రమ్మన్నాడు. ఈ పదిరోజులలోను అతని నిలకడ కొంతవరకు తెలుస్తుంది. అందుకని ఆ మాట చెప్పాడు గురువుగారు. పదిరోజులు పూర్తి అయినాయి. పదకొండవ రోజు ఉదయాన్నే స్నానం సంధ్య పూర్తిచేసుకుని, మడిబట్టతో గురువుగారింటికి బయలుదేరాడు. ఇంటిదాకా వచ్చాడు. ఇంతలో తన నెత్తిన ఏదో చెత్త పడ్డది. ఏమిటా అని తలెత్తి చూశాడు. గురువుగారింట్లో పని మనిషి ఇల్లు ఊడ్చి చెత్త వాకిట్లో పోసింది. అదంతా అతని నెత్తిన పడింది. అతనికి చాలా కోపం వచ్చింది. పని మనిషిని చడామడా నాలుగు దులిపేశాడు. వెనక్కి తిరిగి ఇంటికి వెళ్ళి మళ్ళీ స్నానం చేసి వచ్చాడు. చెప్పిన ముహూర్తం అయిపోయింది. మళ్ళీ నెల రోజుల తరువాత రమ్మన్నాడు గురువుగారు.

నెల గడువు పూర్తయింది. మళ్ళీ స్నానం సంధ్య పూర్తిచేసుకుని గురువు గారింటికి బయలుదేరాడు. ఈసారి చాలా జాగ్రత్తగా నడుస్తున్నాడు. చెత్త ఎక్కడ మీద పడుతుందోనని భయపడుతున్నాడు. గురువుగారింటికి వచ్చాడు. తలుపులు ఓరగా వేసి ఉన్నాయి. తలుపు తోసుకుని లోపలకు కాలుపెట్టాడు. ముఖం నిండా, వంటినిండా దుమ్ము పడింది. ఏమిటా అని చూశాడు. ఎదురుగా పనిమనిషి చీపురుతో

ఇల్లు ఊడుస్తోంది. అందులో భాగంగా వాకిలి దగ్గర ఉండే కాళ్ళు తుడుచుకునే పీచు దులిపింది. ఆ దుమ్ము తన ముఖాన, వంటిమీద పడింది. ఈసారి పనిమనిషి మీద కోపం రాలేదు. కాని ఇంటికి వెళ్ళి స్నానం చేసి వచ్చాడు. ముహూర్తం వెళ్ళిపోయింది. మళ్ళీ ఇరవై రోజుల తరువాత రమ్మన్నాడు గురువుగారు.

ఎదురుచూశాడతడు. ఇరవై రోజుల గడువు పూర్తయింది. ఉదయాన్నే గురువు గారింటికి బయల్దేరి వెళ్ళాడు. ఈసారి గురువు గారింటి తలుపులు తీసే ఉన్నాయి. లోపలకు వెళ్ళాడు. కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగా దొడ్లో గురువుగారు పూజాపాత్రలు కడుగుతున్నాడు. ఈ వ్యక్తి కుర్చీలో అలాగే కూర్చున్నాడు. వెళ్ళి గురువుగారికి సాయం చెయ్యలేదు. కొంతసేపటికి గురువుగారు లోపలకు వచ్చాడు. కాని బాగా ఆలస్యమయింది. ముహూర్తం దాటిపోయింది. పదిరోజుల తరువాత రమ్మన్నాడు. పదిరోజుల తరువాత వచ్చాడతడు. ఈసారి ఏ అడ్డంకులూ రాలేదు. గురువుగారు మంత్రోపదేశం చేశాడు.

ఇక్కడ వచ్చిన అడ్డంకులన్నీ గురువుగారు కావాలని కల్పించినవే. మంత్రోపదేశం తీసుకోవాలన్న పట్టుదల అతనికి ఎంతవరకు ఉన్నదో తెలుసుకోవాలి. అతని సహనాన్ని పరీక్షించాలి అనుకున్నాడు. పరీక్షించాడు. ఈ రకంగా మంత్రంమీద అతనికి ఉన్న శ్రద్ధ, గురువుమీద ఉన్న గౌరవము ఏపాటిదో పరీక్షించిన తరువాతనే మంత్రోపదేశం చేస్తాడు గురువు. ఇక్కడ ఇంకొక మంచి సన్నివేశాన్ని చెబుతాను చూడండి.

ఒకరోజు మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. నేను అప్పుడే కాలేజీనించి వచ్చి 'స్వింగ్‌చైర్' (ఊగేకుర్చీ)లో కూచున్నాను. ఇంతలో ఎవరో ఇద్దరు లోపలికి వచ్చారు. వాళ్ళ చేతిలో ఏవో సంచులున్నాయి. వాటిని అక్కడ బల్లమీద పెట్టి నుంచున్నారు. నాకేం అర్థం కాలేదు. ఎవరు మీరు? అని అడగబోతున్నాను. ఇంతలో ఒక లావుపాటి వ్యక్తి లోపలికి వచ్చాడు. వెడల్పాటి జరీ అంచు పంచె మడిచి లుంగీగా కట్టుకున్నాడు. నడుముకు బెల్టు. మెడలో రుద్రాక్షలు. రకరకాల మాలలు ఉన్నాయి. వాటన్నింటికీ బంగారు డాలర్లు వ్రేలాడుతున్నాయి. పైన చొక్కా లేదు. ఉత్తరీయం కప్పుకున్నాడు. ముఖాన రూపాయంత బొట్టు. తలమీద జుట్టు దువ్వి ముడివేశాడు. చూడగానే 'స్వామిజీ' అనిపించాడు. నేను కుర్చీలోంచి లేచి నమస్కారం చేశాను. అంతవరకు నేను కూర్చున్న కుర్చీ వారికి చూపించాను. కూర్చున్నాడు.

అంతవరకు అక్కడ నుంచున్న ఇద్దరినీ బయటకు వెళ్ళమన్నాడు. నేను ఆ ప్రక్కనే ఉన్న సోఫాలో కూచున్నాను. ఆయన చెప్పటం మొదలుపెట్టాడు. ఆయనది రంగారెడ్డి జిల్లా. హైదరాబాదుకు ముప్పై కిలోమీటర్ల దూరంలో ఉన్న ఒక ఆశ్రమం. ఆ ఆశ్రమానికి అధిపతి ఆయన. అందరికి జ్ఞానబోధ చేస్తుంటాడు. పూజలు నిర్వహిస్తుంటాడు. మంత్రోపదేశం చేస్తుంటాడు. అయితే ఆయనకు ఇప్పుడు ఒక మంత్రం కావాలి. దానికోసం గురువును వెతుకుతూ తిరుగుతున్నాడు. ఇద్దరు ముగ్గురి దగ్గరకు వెళ్ళాడు. వాళ్ళు గొప్పవాళ్ళే. కాని ఈయనకు వాళ్ళు నచ్చలేదు. ఒకాయన మంత్రం ఇస్తాను పాతికవేలు ఇమ్మన్నాడట. అందుకని ఆయన దగ్గరకు వెళ్ళలేదట. గడచిన రాత్రి అమ్మవారు కలలో కనిపించి నా పేరు చెప్పిందట. అంతకుముందే నా గురించి విని ఉన్నాడట. అందుకని నా దగ్గరకు వచ్చాడు. మీ పుస్తకాలు నేను మా ఆశ్రమం తరఫున ప్రింటు వేయిస్తాను అన్నాడు. రెండు నిమిషాలు నేను ఏమీ మాట్లాడలేదు. ఆ తరువాత మీరు నాకు ఏమీ చెయ్యనవసరం లేదు. మీకు మంత్రం చెబుతాను. అని చెప్పి పంచాంగం చూసి అప్పటికి మూడవరోజున ఉదయం ఆరున్నరకల్లా రండి. ఏడు దాటితే నేను ఉండను. అలా కుదరకపోతే మధ్యాహ్నం పదకొండున్నర దాటిన తరువాత రండి అన్నాను. ఆ మాటలువిన్న ఆయన ఆ క్రితం రోజే విజయవాడ వచ్చి హోటలులో ఉంటాను. కాబట్టి ఉదయం ఆరు గంటలకల్లా మీ ఇంటికి వచ్చేస్తాను అని చెప్పి పాదాభివందనం చేసి వెళ్ళిపోయాడు. కాని నాకు మాత్రం మనసులో పీకుతూనే ఉంది. ఈయన రాగానే నేను కూర్చునే కుర్చీలో కూర్చున్నాడు. అలా కూర్చోకూడదు కదా? డబ్బులంటాడు, క్వాలిస్ కారంటాడు. ఏమిటిదంతా ? సరే చూద్దాం. రెండు రోజులు టైం ఉందిగా అని ఊరుకున్నాను. రెండు రోజులు గడిచినాయి. ఆయన ఉదయాన్నే వస్తానన్నాడు పాపం పెద్దవాడు. అని ఎదురు చూశాను. రాలేదు. సరే నేను కాలేజీకి వెళ్ళి పదకొండున్నరకల్లా ఇంటికి వచ్చాను. ఆయన కోసం ఎదురు చూస్తున్నాను. పన్నెండు దాటింది. చివరకు సెల్‌కు ఫోన్ చేశాను. మార్కాపురం దగ్గర ఉన్నాను. అరగంటలో వస్తాను అన్నాడు. అరగంటలో ఎలా వస్తాడు? అయినా సరే చూద్దాం అనుకుని ఒంటిగంటదాకా చూశాను. రాలేదు. మళ్ళీ ఫోన్ చేశాను. ఇప్పుడే విజయవాడ వచ్చాను. స్నానం అదీ చేసి అరగంటలో వస్తాను అన్నాడు. చూడండి ఆయనకు మంత్రం మీదకాని, గురువు మీద కాని భక్తి ఎంత ఉందో? ఆయనకు మంత్రం చెబితే పదిమందికి ఉపయోగిస్తుంది అనుకున్నాను. కాని అలా లేదు పరిస్థితి.

లోపలికి వెళ్ళి భోజనం చేసేశాను. నెమ్మదిగా రెండు గంటలకు వాకిట్లో కారాగింది. కారు దిగి పైకి వచ్చాడు. లోపలికి వెడదామా ? అన్నాడు. ఆయన మంత్రం చెప్పుకోవటానికి వచ్చినట్టు లేదు. నాకు చెప్పటానికి వచ్చినట్టుంది. 'భోజనం చేసేశాను' అని చెప్పాను. చాలా విసురుగా చూశాడు నా వంక. విసవిసా వెనుదిరిగి వెళ్ళిపోయాడు. బహుశః పనికిరాని గురువులలో నన్నుకూడా చేర్చి ఉంటాడు. ఇలాంటివాళ్ళకు మంత్రోపదేశం పొరపాటున కూడా చెయ్యరాదు. వీళ్ళకి మంత్రం చెబితే వచ్చే మంచికన్న, చెడే ఎక్కువ ఉంటుంది. అందుచేతనే వచ్చినవాణ్ణి కొంతకాలంపాటు పరీక్షించాలి. దీనికి ఛాందోగ్యోపనిషత్తులోని ప్రజాపి కథ మంచి ఉదాహరణ.

పూర్వకాలంలో ప్రజాపతి ఒకసారి ఆత్మతత్త్వాన్ని గురించి ఒక ప్రకటన చేశాడు.

"ఆత్మకు పాపం అంటదు. ముసలితనం రాదు. మృత్యువు దాన్ని కబళించదు. శోకం తాకదు. దానికి ఆకలి దప్పికలు లేవు. మానవుడు సత్యకాముడు, సత్య సంకల్పుడు అయి ఆత్మజిజ్ఞాసను అలవరచుకోవాలి. ఆత్మకోసం అన్వేషించినవాడు, ఆత్మను అనుభవించినవాడు ఆత్మస్వరూపాన్ని పొందుతాడు. అతడికి పూర్ణస్థితి వస్తుంది."

దేవతలు రాక్షసులు అందరూ ఆ మాటలు విన్నారు. ఆత్మను గురించి మనంకూడా అన్వేషిద్దాం. ఆత్మవల్ల అన్ని కోరికలు తీరతాయని బ్రహ్మ చెప్పాడు కదా ! అని వారు భావించారు.

దేవతలరాజు ఇంద్రుడు, రాక్షసుల రాజు విరోచనుడు ఇద్దరూ ఆత్మజ్ఞానం సంపాదిద్దామని చేతిలో దర్భలు పట్టుకుని బ్రహ్మవద్దకు వెళ్ళారు. బ్రహ్మ వీరిద్దరినీ పన్నెండు సంవత్సరాలు బ్రహ్మచర్య దీక్ష వహించి నియమ నిష్ఠలతో తన దగ్గరే ఉండి కాలం వెళ్ళబుచ్చమని చెప్పాడు. ఆయన మాట ప్రకారం దీక్ష పూర్తి చేశారిద్దరూ. అప్పుడు బ్రహ్మ "వత్సలారా ! మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు?" అని అడిగాడు.

"భగవాన్, ఆత్మతత్త్వాన్ని గురించి నువు చెప్పిన వివరాలు విన్నాం. ఆత్మను గురించి ప్రత్యక్షంగా తమ నోటిమీదగా వినాలని వచ్చాం" అన్నారు ఇంద్ర విరోచనులు.

"మనుష్యుల కనుపాపలలో మెదలుతూ కనిపించే పురుషుడే ఆత్మ. ఆత్మభయం లేనిది, మరణము లేనిది. అదే బ్రహ్మము" అన్నాడు బ్రహ్మ.

ఆ మాటలు విన్న వారు "భగవాన్ ! నీటిలో కనిపించే ప్రతిరూపం, అద్దంలో కనిపించే ప్రతిరూపం. ఈ రెండింటిలో ఏది ఆత్మ?" అని అడిగారు. దానికి బ్రహ్మ. "నేను మొదటగా కళ్ళలో మెరిసే ఏ పురుషుణ్ణి వర్ణన చేశానో, అతడే వీటన్నిటిలోనూ ప్రతిబింబిస్తాడు. మీరు వెళ్ళి నీటిలోను, అద్దంలోను, మీ రూపం చూసుకుని నాకు చెప్పండి" అన్నాడు. ఇంద్రుడు, విరోచనుడు ఇద్దరూ అలాగే చేసి ప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. ప్రజాపతి వీరిని చూసి "మీరు ఏం చూశారు?" అన్నాడు.

"నఖశిఖపర్యంతము కేశపాశాలతో మా శరీర ప్రతిరూపమే మాకు నీటిలోనూ, అద్దంలోనూ కూడా కనిపించింది" అన్నారు వాళ్ళు.

"శరీరాలు శుభ్రపరచుకుని, మంచి వస్త్రాలు, ఆభరణాలు ధరించి, నీటిలో మీ ముఖాన్ని చూచుకోండి. ఆ తరువాత ఏం చూశారో నాకు చెప్పండి" అన్నాడు బ్రహ్మ. అలాగే అని చెప్పి వారిద్దరూ వెళ్ళి, కొంతసేపటికి తిరిగి వచ్చి "స్వామీ ! చక్కని అందమైన వస్త్రాలతో అలంకరించబడిన మా శరీరాలే మాకు కనిపించాయి" అన్నారు.

"అభయము, అమృతమయము అయిన ఆత్మ అదే" అన్నాడు ప్రజాపతి.

అది విన్న ఇంద్ర విరోచనులిద్దరూ ఆత్మను గురించి తమకు అంతా తెలిసింది అనుకుని తిరిగి వెళ్ళిపోయారు. అలా వెళ్ళిపోతున్న వారిని చూసి "అసలు ఆత్మజ్ఞానం లభించకుండానే తెలిసింది అనుకుని వారు తిరిగి వెళ్ళిపోతున్నారు. దేవతలైనా, రాక్షసులైనా శరీరమే ఆత్మ అని భావించటం తన హేతువు." అనుకున్నాడు.

విరోచనుడు తనవారిదగ్గరకు పోయి "దేహమే ఆత్మ" అని ప్రచారం చేశాడు.

కాని ఇంద్రుడు జరిగిన విషయాన్ని ఒకసారి సమీక్షించి చూశాడు. అలంకరించుకుంటే అందంగాను, లేకపోతే అసహ్యంగాను కనిపించే ఈ దేహమే గనక ఆత్మ అయితే, మరణానంతరము ఈ ఆత్మ ఏమవుతుంది? శరీరం నశిస్తుంది కదా ! ఆత్మకు మరణం లేదు. ఇదేదో అనుమానంగా ఉన్నది." అనుకుని వెనక్కి తిరిగి మళ్ళీ బ్రహ్మదగ్గరకు వెళ్ళాడు. ప్రజాపతి ఇంద్రునితో అనేక సంవత్సరాలు తపస్సు చేయించి, ఆ తరువాత ఆత్మతత్త్వాన్ని బోధించాడు.

ఇక్కడ చూడండి. ఇంద్రుడు విరోచనుడు ఇద్దరూ గొప్పవారే. మహాతపస్సంపన్నులు. ఒకరు దేవరాజు కాగా రెండవవారు రాక్షసరాజు. వీరు రాగానే

ఉపదేశం చెయ్యలేదు బ్రహ్మ. పన్నెండు సంవత్సరాలు నియమ నిష్ఠలతో తపస్సు చెయ్యమన్నాడు. అంటే వారియొక్క స్థిరసంకల్పం ఏపాటిదో తెలుసుకోవాలనుకున్నాడు. ఆ పరీక్షలో వారు నెగ్గారు. అప్పుడు చెప్పీ చెప్పకుండా విషయం చెప్పాడు. పూర్తిగా చెప్పలేదు. ఈ రకంగా వారి వివేచనా శక్తిని పరీక్షించాడు. అందులో ఇంద్రుడు నెగ్గాడు. అలా అని ఇంద్రుడికి వెంటనే విషయం చెప్పలేదు. మరి కొంతకాలం తపస్సు చెయ్యమన్నాడు. ఈ రకంగా అతన్ని పూర్తిగా పరీక్షించి అప్పుడు బ్రహ్మ తత్త్వాన్ని ఉపదేశించాడు.

ఈ విధంగా శిష్యుడియొక్క పట్టుదల ఏపాటిది ? విషయం తెలుసుకునే అర్హత అతనికి ఎంతవరకు ఉన్నది? అనే విషయాలు పరీక్షించి అప్పుడు మాత్రమే ఉపదేశం చెయ్యాలి. తమోగుణ ప్రధానుడికి తత్త్వబోధ చేయకూడదు.

ఒకసారి ఇద్దరు శిష్యులు మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ గురువులు వేరు వేరు. వారి మాటల్లో గురువుల ప్రస్తావన వచ్చింది. మా గురువుగారు గొప్ప అంటే మా గురువుగారు గొప్ప అనుకున్నారు. వాదన కొంచెం తీవ్రస్థాయికి చేరింది. అప్పుడు

**మొదటివాడు :** ఏంటయ్యా మీ గురువుగారి గొప్ప ? ఆయన మాత్రం మనిషి కాదా ? ఆయనకేమయినా కొమ్ములున్నాయా ?

**రెండవవాడు :** అవును నిజంగానే మా గురువుగారికి కొమ్ములున్నాయి.

మొదటివాడు హేళనగా నవ్వి, కొమ్ములున్నాయా? ఎన్ని కొమ్ములున్నాయి ? రాక్షసుడుకిలాగా ఒక్కటా ? ఎద్దుకులాగా రెండా ? ఎన్ని కొమ్ములున్నాయేం? ఆ మాటలు విన్న రెండవవాడు ఒకటి, రెండు కాదయ్యా ! మా గురువుగారికి మూడు కొమ్ములున్నాయి అన్నాడు.

ఈసారి మరీ హేళనగా నవ్వాడు మొదటివాడు. ఏమిటీ ? మూడు కొమ్ములున్నాయా? వాటితో శిష్యుల్ని పొడుస్తాడా ఏమిటి? అన్నాడు.

దానికి ప్రశాంతమైన చిత్తంతో రెండవవాడు సమాధానం చెబుతున్నాడు. అవునయ్యా ! మా గురువుగారికి మూడు కొమ్ములున్నాయి. వాటితో శిష్యుల్ని పొడుస్తాడు. అదెలాగో చెబుతాను జాగ్రత్తగా విను. మొదటిది 'గ'కు కొమ్మిస్తే 'గు'. ఈ కొమ్ముతో పొడిస్తే శిష్యుడియొక్క తమోగుణం పోతుంది. రెండవది 'ర'కు కొమ్మిస్తే

'రు' దీంతో పొడిస్తే శిష్యుడియొక్క రజోగుణం పోతుంది. మూడవది 'వ'కు కొమ్మిస్తే 'వు' దీంతో పొడిస్తే శిష్యుడియొక్క సత్త్వగుణం పోతుంది. అప్పుడు శిష్యుడు గుణాతీతుడు అవుతాడు." అన్నాడు.

ఈ రకంగా గురువుగారు శిష్యుణ్ణి అనేక రకాలుగా పరీక్షించి అప్పుడు గాని తత్త్వోపదేశం చెయ్యడు.

ఛాందోగ్యోపనిషత్తులో సత్యకామ జాబాలి కథ చూడండి. సత్యకామ జాబాలి అనేవాడు బ్రహ్మవిద్య కోసం గౌతముడి దగ్గరకు వెడతాడు. అతనికి శుశ్రూష చేస్తుంటాడు. చాలాకాలం గడిచింది. తోటివారందరికీ విద్యాభ్యాసం పూర్తయింది. కాని తనకు మాత్రం ఏమీ చెప్పలేదు గురువుగారు. తను చేసుకున్న పాపం ఏమిటి? తనలో లోపం ఏమిటి? ఇలా ఆలోచిస్తున్నాడు. బాధ పడుతున్నాడు.

ఒకరోజు గౌతముడు సత్యకాముణ్ణి పిలిచి వట్టిపోయిన ఆవులు, ఆబోతులు నాలుగువందలు ఒప్పచెప్పి, "వీటిని అడవిలో మేపుకుని, వీటి సంఖ్య రెట్టింపయిన తరువాత తిరిగి రావలసింది" అన్నాడు.

గురువాజ్ఞ ప్రకారం అడవికి వెళ్ళాడు సత్యకాముడు. గొల్లవాడిలాగా పశువులను కాస్తున్నాడు. బ్రహ్మజ్ఞానం కోసం పరితపిస్తూనే ఉన్నాడు. ఇలా చాలా ఏళ్ళు గడిచినాయి. పశువుల సంఖ్య గణనీయంగా పెరిగింది. అప్పుడు ఒకరోజు సాయంత్రం ఆ మందలో నుంచి ఒక ముసలి ఆబోతువచ్చి "సత్యకామా ! నీ కర్మ పరిపక్వమైంది. పశువుల సంఖ్య కూడా రెట్టింపయింది. ఇక బయలుదేరి ఆశ్రమానికి వెళ్ళు. బ్రహ్మతత్త్వం నాలుగు భాగాలుగా ఉంటుంది. అందులో మొదటిభాగాన్ని నేను చెబుతాను. ఈ విశాల విశ్వంలో నాలుగు దిక్కులు బ్రహ్మతత్త్వంలో ఒక భాగము. మిగిలిన మూడింటినీ అగ్ని, దేవుడు, హంస, నీటిపక్షి చెబుతాయి." అని చెప్పింది రెండవ రోజున అగ్నిదేవుడు "భూమి, ఆకాశము, సముద్రాలు, పర్వతాలు బ్రహ్మతత్త్వంలో రెండవ భాగము" అని చెప్పాడు. మూడవరోజున హంస "అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుల్లతలు అన్నీ పరబ్రహ్మలో మూడవభాగము" అన్నది. నాల్గవ రోజున నీటిపక్షి "ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రవణం బ్రహ్మ, మనస్సు బ్రహ్మ. ఇది పరబ్రహ్మ యొక్క నాల్గవభాగము" అన్నది.

ఈ రకంగా బ్రహ్మను గురించి తెలుసుకున్న సత్యకాముడు ఆశ్రమం చేరాడు. మహదానందంతో బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతున్న శిష్యుణ్ణి ఆలింగనం చేసుకుని బ్రహ్మజ్ఞానాన్ని పూర్తిగా ఉపదేశించాడు గౌతముడు.

ఇక్కడ చూడండి. సత్యకాముడికి వెంటనే బ్రహ్మోపదేశం చెయ్యలేదు గౌతముడు. చాలాకాలం పరీక్షించాడు. పశుపాలన చేయించాడు. ఆ పరీక్షలో విజయం సాధించాక అప్పుడు ఉపదేశం చేశాడు. ఇదే విధంగా "ఉపకోశలుడి కథ"

ఒకవేళ ఆ శిష్యుడు తన కుమారుడే అయినా గురువుగారు ఇలాగే చేస్తాడా? అనే అనుమానం వస్తుంది. ఇక్కడ తరతమ భేదాలుండవు. ఎవరైనా ఒకటే. దీనికి ఉదాహరణగా ఉద్దాలకుడు, శ్వేతకేతువుల కథ. అలాగే తైత్తిరీయోపనిషత్తులోని భృగుమహర్షి కథ. వరుణ మహర్షి కుమారుడు భృగువు. వరుణుడు బ్రహ్మజ్ఞాని. అతని కుమారుడైన భృగువు విద్యాభ్యాసం పూర్తిచేసి, తండ్రి దగ్గరకు వచ్చి బ్రహ్మజ్ఞానం ఉపదేశించమన్నాడు. బ్రహ్మజ్ఞానమనేది ఒకరు చెబితే తెలిసేది కాదు. ఎవరికి వారే తెలుసుకోవాలి. వెళ్ళి తపస్సు చెయ్యి అన్నాడు తండ్రి. పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు కుమారుడు. అప్పుడు అతడికి తెలిసింది **'అన్నమే పరబ్రహ్మము'** అని. అదే మాట తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. మళ్ళీ పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు. ఇప్పుడు తెలిసింది **'ప్రాణమే పరబ్రహ్మ'** అని. అదే మాట తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. మళ్ళీ పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు కుమారుడు. ఇప్పుడు తెలిసింది **'మనస్సే పరబ్రహ్మ'** అని. కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు కుమారుడు. ఇప్పుడు తెలిసింది **'విజ్ఞానమే పరబ్రహ్మ'** అని. అదే మాట తండ్రికి చెప్పాడు. కాదన్నాడు తండ్రి. మళ్ళీ తపస్సు చెయ్యమన్నాడు. పన్నెండు సంవత్సరాలు తపస్సు చేశాడు కుమారుడు. ఇప్పుడు తెలిసింది **'ఆనందమే పరబ్రహ్మ'** అని. ఇప్పుడు కుమారుడైన భృగువును మెచ్చుకున్నాడు వరుణుడు "పంచకోశముల మధ్య ఉండే ఆనందమయుడే పరబ్రహ్మ" అంటూ బ్రహ్మోపదేశం చేశాడు. కాబట్టి శిష్యుడు తన సొంత కుమారుడైనా అతన్ని పరీక్షించాల్సిందే.

మహాభారతంలో ద్రోణాచార్యుడు తనకు తెలిసిన విలువిద్య అంతా శిష్యుడైన అర్జునుడికి చెప్పాడు. కాని తన కుమారుడైన అశ్వత్థామకు చెప్పలేదు. కాబట్టి గురువుగారు శిష్యుణ్ణి బాగా పరీక్షించి, అతని అర్హతను బట్టి విద్యను ఉపదేశిస్తాడు.

# ౬. గుర్వష్టకం

ఉపనిషత్తులలో ఒక కథ ఉంది. శరీరంలో ఉన్న ఇంద్రియాలన్నీ ఒకసారి సభ ఏర్పాటు చేసుకున్నాయి. అందులో అనేక విషయాల మీద చర్చ జరిగిన తరువాత "తమలో ఎవరు గొప్ప" అనే మీమాంస వచ్చింది. ఇంద్రియాలన్నీ నేను గొప్ప అంటే నేను గొప్ప అని వాదించుకున్నాయి. ఎంతకీ ఈ వాదన తెగలేదు. తగవు తీరలేదు. అప్పుడు ఇంద్రియాలన్నీ బాగా ఆలోచించి, తమ తగవును తీర్చగలవాడు సృష్టికర్త అయిన బ్రహ్మ ఒక్కడే అనే నిర్ణయానికి వచ్చి, సత్యలోకానికి ప్రయాణమైనాయి. అక్కడ ప్రజాపతిని దర్శించి, అనేక రకాలుగా ఆయన్ను స్తుతించి, తమ వివాదాన్ని వినిపించి, తమలో ఎవరు గొప్పో తేల్చమన్నాయి. ఆ మాటలు విన్న ప్రజాపతి కొద్దిక్షణాలు మౌనం వహించి "ఇంద్రియాల్లారా ! మీలో ఎవరు గొప్ప అనే విషయాన్ని తేల్చటం చాలా కష్టమైన పని. కాబట్టి మీరు ఒక పని చెయ్యండి. మీరు సంవత్సరానికి ఒకరు చొప్పున శరీరాన్ని విడిచిపోండి. ఇలా వెళ్ళినప్పుడు ఎవరు లేకపోతే ఈ శరీరం పని చెయ్యటం మానేస్తుందో, వారు గొప్ప అని నిర్ణయించండి" అని చెప్పాడు. ఇంద్రియాలన్నింటికీ ఈ సలహా బాగా నచ్చింది.

ముందుగా వాక్కు శరీరం నుంచి నిష్క్రమించింది. ఒక సంవత్సరంపాటు శరీరానికి దూరంగా ఉండి తరువాత తిరిగి వచ్చి "నేను లేకపోతే మీరు ఎలా ఉన్నారు?" అని మిగిలిన ఇంద్రియాలను అడిగింది.

నువ్వు వెళ్ళిపోవటంవల్ల పెద్దగా నష్టం ఏదీలేదు. కేవలం వాక్కు పోయింది. అంటే శరీరం మూగదయిపోయింది. అంతేగాని మిగిలిన ఇంద్రియాలన్నీ మామూలుగానే పని చేశాయి. కళ్ళు చూస్తూనే ఉన్నాయి. చెవులు వింటూనే ఉన్నాయి. ఇలా అన్ని పనులూ జరుగుతూనే ఉన్నాయి. కేవలం మాటలేదు అంతే. పసిపిల్లవాడికి మాటలు రావు. మూగవాడు మాట్లాడలేదు. అయితే ఏం ? వాళ్ళు బ్రతకటం లేదా? అలాగే శరీరం జీవించే ఉన్నది" అన్నాయి మిగిలిన అవయవాలు. ఆ మాటలు విన్న వాక్కు మారు మాట్లాడకుండా శరీరంలో ప్రవేశించింది.

తరువాత దృష్టి శరీరాన్ని వదిలి వెళ్ళిపోయి, సంవత్సరం తరువాత తిరిగివచ్చి, నేను లేకపోతే మీరు ఎలా ఉన్నారు అని మిగిలిన అవయవాలను అడిగింది. అప్పుడవి

"నువు లేకపోతే చెప్పుకోతగ్గ ఇబ్బంది ఏదీ కలగలేదు. శరీరం జీవించే ఉంది. కేవలం చూపు మాత్రమే లేదు. అయితే ఏం ? గ్రుడ్డివాడు జీవించటం లేదా? అలాగే శరీరం జీవించే ఉన్నది" అన్నాయి. మారు మాట్లాడకుండా దృష్టి శరీరంలో ప్రవేశించింది.

ఆ తరువాత శ్రవణం శక్తి, జిహ్వ, మనస్సు ఒక్కొక్కటిగా శరీరాన్ని వదలి వెళ్ళి తిరిగి వచ్చి తాము లేకపోతే నష్టం ఏదీలేదు అని తెలుసుకున్నాయి. చివరకు ప్రాణం వంతు వచ్చింది. ప్రాణం ఈ శరీరాన్ని వదలి వెళ్ళటానికి ఉద్యక్తమవుతోంది. ఆ సమయంలో శరీరంతో ఇంద్రియాలకున్న బంధనాలన్నింటినీ త్రెంచి వేస్తున్నట్లు అనిపించింది. శరీరానికి ఊపిరి అందటం లేదు. కళ్ళు కనపడటం లేదు. చెవులు వినబడటం లేదు. కాళ్ళు చేతులు కదలటం మానేశాయి. శరీరం గాల్లో తేలుతున్నట్లు అనిపించింది. దాంతో ఇంద్రియాలన్నీ భయపడ్డాయి. అవన్నీ ప్రాణం చుట్టూ చేరి "ఓ ప్రాణమా ! నువు మాత్రం శరీరాన్ని విడిచి వెళ్ళకు. నువు గనక వెళ్ళిపోతే శరీరం చచ్చిపోతుంది. అప్పుడు మేమంతా ఉపయోగం లేకుండా పోతాము. మా అందరిలోకి శ్రేష్ఠుడివి 'నువ్వే' అని ఒప్పుకుంటున్నాము. నువ్వు ఇక్కడే ఉండి మమ్మల్ని జీవింపచెయ్యి" అని బ్రతిమాలాయి.

ఈ రకంగా శరీరంలో ఉన్న అవయవాలన్నింటిలోను ప్రాణమే గొప్ప అని విషయం తేలిపోయింది. ప్రాణం గనక లేకపోయినట్లైతే మిగిలిన అవయవాలు ఏమున్నా ఒకటే. అలాగే ఈ లోకంలో అన్నీ ఉన్నప్పటికీ అంటే లౌకికమైన సత్యాలు ఎన్ని ఉన్నప్పటికీ కైవల్య ప్రాప్తి కావాలనుకునేవాడికి గురువుయొక్క కృపాకటాక్ష వీక్షణాలు ఉండి తీరాలి. ఈ విషయాన్ని అనేకమంది మహానుభావులు నొక్కి వక్కాణించారు. ఇంచుమించుగా అందరు చెప్పిందీ ఒకటే. వీరిలో మొదటివాడు శంకరాచార్యుడు. ఆయన "గుర్వష్టకము" అనే పేరుతో పది శ్లోకాలు చెప్పటం జరిగింది. వాటిని ఇప్పుడు చూద్దాం.

**శరీరం సురూపం తథావా కళత్రం**
**యశశ్చారు చిత్రం ధనం మేరుతుల్యం ।**
**మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥ 1**

దృఢమైన శరీరము, అందమైన రూపము, మంచి భార్య, అపరిమితమైన ధనము, దిగంతాలకు వ్యాపించిన కీర్తి ఎన్ని ఉన్నప్పటికీ, గురువుయొక్క పాదపద్మాల మీద మనసును నిలుపలేకపోయినట్లైతే ఏమీ ఉపయోగం లేదు.

శంకర భగవత్పాదులవారు సాధకుణ్ణి హెచ్చరిస్తున్నారు. హితబోధ చేస్తున్నారు. ఓ సాధకా ! ఈ శరీరానికి అందమనేది నీ వల్ల రాలేదు. శిల్పశాస్త్రం ప్రకారం శిల్పి విగ్రహాన్ని చెక్కాడు. ఆ విగ్రహంలో కళ ఉండదు. ఎందుకంటే దృష్టి ఏర్పాటు చేస్తేనే గాని విగ్రహానికి కళ రాదు. దృష్టిని ఏర్పాటుచేసిన తరువాత, శిల్పాచార్యుడు తాను చెక్కిన విగ్రహానికి తానే నమస్కరిస్తాడు. అలాగే సృష్టికర్త తాను తయారుచేసిన బొమ్మలను చూసి తానే మురిసిపోతాడు. నీ శరీరాన్ని సృష్టించింది ఎవరు ? దీనికి కారణం నువ్వు కాదు. ముందు ఆ విషయం తెలుసుకో. ఈ శరీరానికి అందం నీవల్ల రాలేదని గుర్తుంచుకో. అయినప్పటికీ అందమైన శరీరాన్ని చూసి చాలా గర్విస్తున్నావు? ఈ అందంవల్ల ప్రయోజనం ఏమిటి ? ఇది కేవలము బాహ్యసౌందర్యం. ఉపయోగం లేనిది. నీ భార్య చాలా అందగత్తె. అయితే ఉపయోగం ఏమిటి? నీ అందమే నీకు ఉపయోగం లేనప్పుడు, నీ భార్య యొక్క అందంవల్ల కలిగే ప్రయోజనం శూన్యం కదా ! ఇక కీర్తిప్రతిష్ఠలు అంటావా? ఈ జీవితమే అశాశ్వతమైనప్పుడు, కీర్తి ప్రతిష్ఠలు శాశ్వతమవుతాయా ? ఇక ధనమంటావా ! ఇది కేవలము మానవ నిర్మితమైనది. మానవుడే ఈ ధనాన్ని సృష్టించి తానే దానికి దాసుడైనాడు. ధనార్జన అనేది నయం కానటువంటి, మందు లేనటువంటి రోగం. ఒక్కసారి గనక ఆరోగం సోకిందా ఇంక జీవితంలో తగ్గదు. ఎంత సంపాదించినా తృప్తి అనేది ఉండదు ఇంకా సంపాదించాలనే తపన తప్ప. **'హేమంబుకూడ బెట్టిన భూమీసులపాలజేరు'** చీమలు పెట్టిన పుట్టలలో పాములు నివసిస్తాయి. అలాగే మనం కడుపు కట్టుకుని సంపాదించిన సొమ్ము ఎవరైనా ఎత్తుకుపోతారేమో అనే భయం. నిద్రాహారాలు మాని దాన్ని కాపలాకాస్తాడు. కాని చివరకు అది రాజులపాలో, రాళ్ళపాలో అవుతుంది. ఒక్కొక్కసారి వీళ్ళపిల్లలే డబ్బు లెక్క లేకుండా ఖర్చు పెడుతుంటారు. అది చూసి వీళ్ళు నరకయాతన అనుభవిస్తారు. ధనవంతుడికి తనవారు ఎవరూ ఉండరు. అందరూ శత్రువులే.

ఓ సాధకుడా ! ఈ ధనాన్ని నీకు భగవంతుడు అనుగ్రహించాడు. భగవంతుని యొక్క కృపాకటాక్ష వీక్షణాలతోనే ధనార్జన చేశావు. మరి ఆ ధనాన్ని భగవంతుడి

సేవకే వినియోగించవచ్చును కదా ? భగవదర్పణం చేసింది మళ్ళీ మన ఖాతాలోనే జమ అవుతుంది. దాన్ని నువ్వు, నీవాళ్ళు జన్మజన్మలకు అనుభవించవచ్చు. కాని అలా చెయ్యబుద్ధి కాదు. మంచి కార్యాలు చెయ్యాలి అంటే మంచి బుద్ధి ఉండాలి. అది పూర్వజన్మ పుణ్యఫలంవల్ల వస్తుంది. ఈ రకంగా పూర్వజన్మ పుణ్యఫలమే గనక ఉన్నట్లైతే నీ మనస్సు సద్గురువు యొక్క పాదాలమీద లగ్నమవుతుంది. గురువు అంటే పరమేశ్వర స్వరూపము అని గుర్తించు. అటువంటి గురుపాదపద్మాల మీద మనసు లగ్నం కాకపోతే, గురుధ్యానాన్ని పొందకపోతే, గురుసేవ చెయ్యకపోతే, గురుతత్త్వాన్ని గ్రహించకపోతే, గురూపదేశం పొందకపోతే, మోక్షమార్గాన్ని త్రొక్కకపోతే, నీకు ఏవి ఉన్నా, ఎన్ని ఉన్నా ప్రయోజనం లేదు. దృఢమైన శరీరంవల్ల, అందమైన రూపంవల్ల, సౌందర్యవతి అయిన భార్యవల్ల, కీర్తి ప్రతిష్ఠలవల్ల, ధనధాన్యాదులవల్ల ఏమీ ప్రయోజనం లేదు. వాటివల్ల మదమాత్సర్యాలు బాగా పెరిగి మానవుడు అధః పతనమవుతాడు.

**అర్థాగృహే నివర్తంతే స్మశానే మిత్రబాంధవాః ।**
**సుకృతం దుష్కృతం చైవ గచ్ఛంత మనుగచ్ఛతి ॥**

ఓ మానవుడా ! జాగ్రత్తగా విచారించు. నీకు వృద్ధాప్యం వచ్చినప్పుడు శరీరం పట్టు తప్పుతుంది. ముఖం అంతా ముడతలు పడుతుంది. కళ్ళు కనిపించవు. చెవులు వినిపించవు. కాళ్ళు చేతులు పని చెయ్యవు. నడవలేవు. కూర్చోలేవు, చూడలేవు, వినలేవు, మాట్లాడలేవు. నోటినుంచి చొంగకారుతుంది. అన్నింటికీ ఇంకొకరి మీద ఆధారపడాల్సి వస్తుంది. నీవాళ్ళే నిన్ను అసహ్యించుకుంటారు. అప్పుడు ఏమయింది నీ దేహదారుఢ్యం ? ఏమైంది నీ సౌందర్యం ?

నువ్వు మరణించిన తరువాత నువ్వు సంపాదించిన సిరిసంపదలు, భోగభాగ్యాలు అన్నీ ఇంటిదగ్గరే జాగ్రత్తగా ఉంటాయి. నీ వారసులు వాటికోసం కొట్లాడుకుంటారు. నీ మీద అభిమానం ఉన్నవాళ్ళు నీతోపాటు స్మశానందాకా వస్తారు. అంతే ఆ తరువాత నీతో వచ్చేవి నువ్వు చేసిన మంచి చెడులే. అందుచేతనే శరీరంలో ఓపిక ఉన్నప్పుడే, చేయగలిగినప్పుడే సద్గురువును ఆశ్రయించు.

పదవిలో ఉన్నవాడు ఉన్నతస్థాయిని చేరుకోవటానికి అనేక పాట్లు పడతాడు. మంచి ఇల్లు కట్టుకోవటానికి ఎంతోమందిని సంప్రదిస్తాడు. ఎన్నో రకాలుగా ఆలోచిస్తాడు. మరి జీవిత పరమావధి అయిన కైవల్యం పొందటానికి మంచి మార్గాన్ని

ఎందుకు వెతుక్కోవు? సద్గురువును ఎందుకు ఆశ్రయించవు? వాసనలేని పూలు పూజకు పనికి రావు. కాబట్టి జీవితంలో ఎన్ని ఉన్నా సద్గురువును ఆశ్రయించని జన్మ నిరర్థకము.

**కళత్రం ధనం పుత్ర పౌత్రాది సర్వం**
**గృహం బాంధవా సర్వమేతద్ధి జాతమ్ ।**
**మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రి పద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥** **2**

ధనధాన్యాలు, సిరిసంపదలు, భోగభాగ్యాలు అన్నీ ఉన్నాయి. కాలు క్రింద పెట్టవలసిన అవసరంలేదు. ఎటు వెళ్ళాలన్నా కార్లు. ఏ పనీ చెయ్యాల్సిన పనిలేదు. ఇల్లంతా నౌకర్లు. ప్రాణానికి ప్రాణమైన భార్య, పిల్లలు, ముద్దులొలికే మనుమలు, మనమరాండ్రు, బంధువులు. ఇల్లంతా ఎంతో హాయిగా ఉంది. ఏమిటి ఈ ఆనందం?

తాను ఏదో పనిమీద బయటకు వెళ్ళాడు. తిరిగి వచ్చేసరికి బాగా ఆలస్యం అయింది. తను రాలేదని భార్యకూడా భోజనం చెయ్యకుండా అలాగే ఉండిపోయింది. ఇది ఒక అలవాటుగా మారింది. కాని ఈ అలవాటులో చెప్పలేని ఆనందం ఉంది. అంతదాకా ఎందుకు? తన చేత్తో పెడితే గాని కుక్కకూడా ఏమీ ముట్టుకోదు. ఏమిటీ బంధం? దీనికంతటికీ కారణం డబ్బు. తన దగ్గర విశేషమైన ధనం ఉంది. అందుకే ఈ బంధువులు, ప్రేమ, అభిమానము అన్నీ.

**ఎప్పుడు సంపద గలిగిన**
**అప్పుడు బంధువులు వత్తురది ఎట్లన్నన్ ।**
**తెప్పలుగ చెరువు నిండిన**
**కప్పలు పదివేలు జేరుగదరా సుమతీ ॥**

నీ దగ్గర ధనం ఉన్నది కాబట్టి బంధువులంతా నీ చుట్టూ చేరారు. నీ మీద ప్రేమ కురిపిస్తున్నారు. అదే నీ దగ్గర ధనం లేకపోతే, నువ్వు దరిద్రుడివైతే ఇలాగే ఉంటారా బంధువులంతా? ఈ ప్రేమ, ఆప్యాయత, అనురాగం అన్నీ అబద్ధం. స్వార్థం లేనిదే మనిషి ఏ పనీ చెయ్యడు. నీ దగ్గర ధనం ఉన్నప్పుడు చూపే ప్రేమ, నీవు దరిద్రుడవైనప్పుడు నీ భార్యకూడా చూపదు.

గడనుగల మగని జూచిన
అడుగులకు మడుగు లిడుదురతివలు ఇలలో ।
గడనుడుగ మగని జూచిన
నడపేనుగ వచ్చె ననుచు నగుదురు సుమతీ ॥

డబ్బుకు దాసోహం అంటుంది లోకం. ఈ సత్యాన్ని గ్రహించు. నిస్వార్థమైన ప్రేమ లేదు. స్వార్థానికి కామానికి అందరూ బానిసలే. మెరిసేదంతా బంగారంకాదు. నువు పొందేదంతా ఆనందం కాదు. ఈ ఆనందం దుఃఖానికి హేతువు అని గుర్తించు. నీ మనస్సును లౌకిక విషయాలనుంచి మళ్ళించు, గురుపాదాల నాశ్రయించు. సద్గురువును ఆశ్రయించిన వాడికి అలౌకికమైన ఆనందం కలుగుతుంది. అది శాశ్వతమైనది. కాబట్టి క్షణికమైన సుఖాలకోసం ప్రాకులాడకు. శాశ్వతమైన ఆనందం పొందాలనే కోరికతో సద్గురువు యొక్క పాదాలను ఆశ్రయించు.

**షడంగాది వేదోముఖేశాస్త్రవిద్యా**
**కవిత్వాది గద్యం సుపద్యం కరోతి ।**
**మనశ్చేన్న లగ్నం గురోరంఘ్రి పద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥** 3

వేదాలు, వేదాంగాలు, శాస్త్రాలు, పురాణాలు అన్నీ చదివాడు. చాలా గొప్ప పండితుడు. అనర్గళంగా ఉపన్యాసం ఇస్తాడు. అలవోకగా కవిత్వం చెబుతాడు. ఎన్నో అవార్డులు, బిరుదులు, సన్మానాలు పొందాడు. కాని అతడి మనసు మాత్రం గురుచరణాల మీద లగ్నం కాలేదు.

ముండకోపనిషత్తులో ఒక కథ ఉన్నది. శునకుని కుమారుడు శౌనకుడు. కఠోర నియమాలతో బ్రహ్మచర్యం పాటించి విద్యాభ్యాసం పూర్తి చేశాడు. బ్రహ్మచర్య దీక్ష విరమించి ఇక గృహస్థాశ్రమం స్వీకరించాలి. ఆ దశలో ఒకరోజు తన గురువుగారైన అంగిరసుడికి నమస్కరించి, "గురుదేవా! దేని గురించి తెలుసుకుంటే సర్వమూ తెలుస్తుందో, దాన్ని దయచేసి నాకు వివరించండి" అన్నాడు. దానికి అంగిరసుడు "లోకంలో మనం తెలుసుకోవలసిన విద్యలు రెండు ఉన్నాయి. ఈ విద్యలు వేదంలో చెప్పడ్డాయి. అవి 1. పరావిద్య 2. అపరావిద్య. పరమేశ్వరుడికి సంబంధించిన విద్య పరావిద్య. కర్మ, ఉపాసనలకు సంబంధించినది అపరావిద్య.

చతుర్వేదాలు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము ఇవన్నీ అపరావిద్య. ఇది లౌకిక ప్రయోజనాలకు ఉపయోగిస్తుంది. ఆత్మతత్వాన్ని బోధించేది పరావిద్య" అని చెబుతాడు.

అలాగే ఛాందోగ్యోపనిషత్తులో ఒక కథ ఉంది. ఒకసారి నారద మహర్షి సనత్కుమారుడి దగ్గరకు వచ్చి తనకు ఆత్మానుభూతిని కలుగచెయ్యమని కోరతాడు. దానికి సనత్కుమారుడు "నారదా ! గతంలో నువ్వు ఏ ఏ విద్యలు అభ్యసించావు" అన్నాడు.

"స్వామీ ! వేదవేదాంగాలు చదివాను. శాస్త్రాలన్నీ అభ్యసించాను. ఎన్నో కళలు నేర్చుకున్నాను. సంగీత సాధన చేశాను. కాని నాకు మనశ్శాంతి లేదు. ఆత్మజ్ఞానం కలగలేదు. ఆత్మజ్ఞానం వల్ల సర్వదుఃఖాలు నశిస్తాయని విన్నాను. కాబట్టి ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించి నాకు దుఃఖ విమోచనం చెయ్యండి" అన్నాడు నారదుడు.

ఆ మాటలు విన్న సనత్కుమారుడు "నారదా ! నువ్వు ఇంతవరకు అభ్యసించినది అపరావిద్య. నీవు సకల శాస్త్రాలు చదివావు. నీకు ఎన్నో సిద్ధాంతాలు తెలుసు. కాని వాటి ఆచరణ లేదు. వాటి ఆంతర్యం నీకు తెలియదు. పరావిద్య అనేది నీకు తెలియదు. నీకు తెలిసినదంతా అపరావిద్య. అదంతా పదాల గారడి. అది పారిభాషిక పరిజ్ఞానము. ఆపదజాలం ఏం సాధించగలదో అదే నీకు లభిస్తుంది. అంతకన్నా నీకు ఇంకేమీ దొరకదు.

ఇంతవరకు నువ్వు తెలుసుకున్నది నామమాత్రమైనది. నువ్వు చదివిన వేదాలకు, శాస్త్రాలకు అన్నింటికీ పేరున్నది. వ్యాకరణం, తర్కం, జ్యోతిషం, నిరుక్తం, సంగీతం, ఇవన్నీ పేర్లే. ఇది నామమాత్రమైన లౌకిక విద్య, దీన్ని అభ్యసించటం వల్ల లౌకికమైన ప్రయోజనమే సమకూరుతుంది. నువ్వు వెళ్ళినచోటల్లా సభా గౌరవం దక్కుతుంది. జనం నీకు నమస్కరిస్తారు. పాదాభివందనం చేస్తారు. పూజిస్తారు. నారదా ! నీకు ఆత్మజ్ఞానం కావాలి అంటే పరావిద్యను అభ్యసించాలి" అంటూ మోక్షకారకమైన పరావిద్యను ఉపదేశిస్తాడు.

కాబట్టి వేదాలు, వేదాంగాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, సంగీతము, సాహిత్యము మొదలైనవన్నీ లౌకిక విద్యలు. వీటివల్ల సిరిసంపదలు, భోగభాగ్యాలు, కీర్తిప్రతిష్ఠలు దక్కుతాయి. అంతేకాని మోక్షం మాత్రం రాదు. జన్మరాహిత్యం కావాలి అంటే సద్గురువును ఆశ్రయించాలి. ఆయన పాదాలు పట్టుకోవాలి.

విదేశేషుమాన్యః స్వదేశేషుధన్యః
సదాచార వృత్తేషు మత్తోనచాన్యః ।
మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రి పద్మే
**తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥** 4

గొప్పగా చదువుకున్నాడు స్వదేశంలో మంచి పేరు ప్రతిష్ఠలు గడించాడు. విదేశాల్లో కూడా గౌరవం పొందాడు. సదాచార సంపన్నుడు అతని పేరు దేశమంతా తెలుసు. అయితే ఏం ? గురువును మాత్రం ఆశ్రయించలేదు.

ఇక్కడ చూడండి. చాలా కష్టపడి చదువుతున్నాడు. మంచి క్రమశిక్షణతో పెరిగాడు. చదివిన చదువుకు సార్ధకత చేకూర్చాడు. రాజుల నాశ్రయించాడు. ఆస్థానంలో ఉన్న పండితులనందరినీ ఓడించాడు. గండపెండేరాలు, స్వర్ణకంకణాలు, కనకాభిషేకాలు జరిగాయి. పల్లకిలో కూర్చోబెట్టి స్వయంగా రాజుగారే ఆ పల్లకి మోశాడు. ఘనమైన సత్కారాలు అందుకున్నాడు. ఇతర రాజ్యాలకు వెళ్ళాడు. అక్కడ ఉన్న పండితులను ఓడించాడు. సన్మానాలు అందుకున్నాడు. ఉదాహరణకు శ్రీనాథ మహాకవిని చూడండి. ఆయన పొందని సత్కారం లేదు. కాని సద్గురువును ఆశ్రయించలేదు. చివరకు నానాకష్టాలు పడ్డాడు. దుఃఖిస్తూనే ప్రాణాలు వదిలాడు. మరి ఇప్పటిదాకా నువ్వు పొందిన సన్మానాలు, సత్కారాలు, కీర్తిప్రతిష్ఠలు అన్నీ ఏమై పోయినాయి. అంత్యకాలంలో ఇవేవీ అక్కరకు రాలేదే. ఒకవేళ పుణ్యకార్యాలు చేసినట్లైతే, పుణ్యలోకాలు పొందుతాడు. తరువాత మళ్ళీ జన్మిస్తాడు. అంతేకాని జన్మరాహిత్యం మాత్రం జరగదు. అలా జరగాలంటే సద్గురువును ఆశ్రయించాలి. ఆయన పాదాలు పట్టుకోవాలి.

క్షమామండలే భూపభూపాలబృందైః
సదాసేవితం యస్యపాదారవిందం ।
మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే
**తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥** 5

ధరామండలంలో ఉన్న రాజులు, మహారాజులు, అందరూ నీ పాదాక్రాంతు లయ్యారు. నిన్ను సేవిస్తున్నారు. అయితే ప్రయోజనం ఏమిటి?

చాలా బలవంతుడు. ధైర్యవంతుడు. శక్తిసంపన్నుడు. ముల్లోకాలను జయించాలని కోరిక. ముల్లోకాలకు ఏలిక కావాలని కోరిక. ఘోరమైన తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై ఏ వరం కావాలో కోరుకోమన్నాడు. ఒక్క ఆడదానితో తప్ప ఎవరివల్లా మరణం ఉండకూడదు అన్నాడు. సరే అన్నాడు బ్రహ్మ. అసలే తమోగుణ ప్రధానుడు. మహాబలవంతుడు. అందులోనూ వరబలం కూడా తోడు కలిసింది. ఇంక అతన్ని ఆపటం ఎవరివల్ల అవుతుంది. అతనికి ఎదురులేదు. తనలాంటి వారిని అంటే తమోగుణ ప్రధానమైన వారినందరినీ చేరదీశాడు. భూలోకంలోని రాజులందరినీ జయించాడు. ముల్లోకాధిపత్యం సంపాదించాడు. దేవరాజైన ఇంద్రుడు కూడా యుద్ధంలో ఇతని ముందు నిలువలేక అరణ్యాలకు పారిపోయాడు. స్వర్గసుఖాలనుభవించాడు. కన్ను మిన్ను కానలేదు. రాజులు, మహారాజులే కాదు దేవతల చేతకూడా ఊడిగం చేయించాడు. అయితే ఏమయింది? చివరకు మృత్యుదేవత వడి చేరక తప్పలేదు. మోక్షం మాత్రం రాలేదు. సద్గురువును గనక ఆశ్రయించి ఉంటే జీవిత లక్ష్యం నెరవేరి ఉండేది. కాని అలా చెయ్యలేదు. గురువు అనేవాడున్నాడు. కాని ఆయనతో ఎప్పుడూ కుట్రలూ, కుతంత్రాలు, యుద్ధ విద్యలమీదనే మంతనాలు జరిపాడు. యజ్ఞయాగాదులు చేశాడు. అవి అన్నీ ఫలాపేక్షతో చేసినవే. తనకు కావలసినది రాజ్యము, అధికారము. వాటిని సంపాదించాడు. పరావిద్య జోలికి పోలేదు. సద్గురువును ఆశ్రయించలేదు. ఈ కారణంచేతనే అతనికి రాజ్యము, ధనము, సైన్యము, అధికారము ఎన్ని ఉన్నా ఏమీ ప్రయోజనం లేదు. వీటివల్ల మోక్షం రాదు.

**యశో మేగతం దిక్షుదాన ప్రతాపాత్**
**జగద్వస్తు సర్వం కరే యత్ప్రసాదాత్ ।**
**మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥** **6**

చాలా దానాలు చేశాడు. అతని కీర్తి దిగంతాల వరకూ వ్యాపించింది. అయినప్పటికీ ప్రయోజనం ఏమిటి ?

దానగుణం కలవాళ్ళు చాలామంది ఉన్నారు. అనేకమంది రాజులు కర్ణుడు, శిబి మొదలైన వాళ్ళు తమ సర్వస్వాన్నీ దానం చేశారు. కురుక్షేత్ర సంగ్రామంలో

ఉండగా కర్ణుడి కవచకుండలాలు దానమడిగాడు ఇంద్రుడు. వచ్చినవాడు దేవరాజు అని తెలిసికూడా దానమిచ్చాడు కర్ణుడు. శరీరాన్ని కోసి దానమిచ్చాడు శిబిచక్రవర్తి. దానమడిగినవాడు సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు అని తెలిసికూడా మూడడుగుల నేల దానం చేశాడు బలిచక్రవర్తి. వారి కీర్తి ప్రతిష్ఠలు దిగంతాలకు వ్యాపించాయి. అయితే ఏమయింది? వారికి మోక్షం రాలేదే. ఎందుకని ? వారు సద్గురువును ఆశ్రయించలేదు.

ఛాందోగ్యోపనిషత్తులో ఒక కథ ఉంది. పూర్వకాలంలో 'మహావృష' సామ్రాజ్యాన్ని జానశ్రుతి మహారాజు పాలిస్తుండేవాడు. అతడు గొప్ప పండితుడు. వేదవేదాంగవిదుడు. దయార్ద్ర హృదయుడు. దానధర్మాలు చెయ్యటంలో అతడికి అతడే సాటి. తన రాజ్యంలో ఎన్నో ధర్మసత్రాలు, అన్నసత్రాలు, విశ్రాంతి గృహాలు కట్టించాడు. బాటసారులకు, పేదవారికి నిరతాన్నదానం చేస్తుండేవాడు. వాటిలో అన్నార్తులకు అన్నివేళలా అన్నదానం జరుగుతూనే ఉండేది. ఇదంతా చేస్తున్న జానశ్రుతి మహారాజు తాను జీవితంలో ఎంతో సాధించాను అనుకునేవాడు. దానం చెయ్యటంవల్ల మనశ్శాంతిని పొంద గలనని, అదే మోక్షానికి మార్గమని అనుకునేవాడు. తనతో సమానమైన ధర్మాత్ముడు ఈ ధరామండలంలో లేడు అనుకునేవాడు. ప్రతిరోజూ తాను చేసిన దానధర్మాలు లెక్క వేసుకుని పొంగిపోతూ ఉండేవాడు.

ఒకరోజు రాత్రిపూట, పౌర్ణమి రోజున అంతఃపుర పైభాగాన ఆరుబయట చల్లని ప్రదేశంలో హాయిగా విశ్రమించాడు మహారాజు. ఇంతవరకూ తాను చేసిన దానధర్మాలు తలచుకుంటూ, లోకంలో తన యశశ్చంద్రికలు ఏ విధంగా వ్యాపించి ఉన్నాయో ఊహించుకుంటున్నాడు. ఈ ఆలోచనతో నిద్ర పట్టలేదు. తల్పంమీద అటూ ఇటూ దొర్లుతున్నాడు. ఇంతలో ఏవో మాటలు వినిపించాయి. "ఈ నిశా సమయంలో ఎవరివీ మాటలు" అని కళ్ళు తెరచి చూశాడు. చుట్టుప్రక్కల ఎవరూ లేరు. పైన ఆకాశం వంక చూశాడు. సరిగ్గా తాను విశ్రమించిన మిద్దెకు పైభాగాన ఆకాశంలో రెండు హంసలు ఎగురుతున్నాయి. అవి అలా ఎగురుతుండగా ఒకటి కొంచెం క్రిందగా వచ్చింది.

ఆ విధంగా క్రిందకు వచ్చిన హంసతో పైన ఉన్న హంస అంటోంది. "ఓ భల్లాక్షా ! (ముందు చూపుగలవాడా) జానశ్రుతి మహారాజు యొక్క యశశ్చంద్రికలు ఇక్కడ అంతటా వ్యాపించి ఉన్నాయి. మరీ అంత క్రిందగా ఎగరకు. అతడి తేజస్సు తాకి భస్మమై పోతావు. జాగ్రత్త అతడు దానధర్మాలు చెయ్యటంలో చాలా గొప్పవాడు.

ఆ మాటలు విన్న ముందున్న హంస "మనం ఎల్లకాలము ఆకాశంలోనే విహరిస్తుంటాము. కాబట్టి ప్రపంచంలో మనకు తెలియని విషయాలు ఏవీ ఉండవు జానశ్రుతి మహారాజును అంతగా పొగడుతున్నావు. బండి తోలుకుని జీవిస్తున్న ఆత్మజ్ఞాని రైక్వుని కన్న ఇతడు ఏమైనా గొప్పవాడా ? కేవలం కీర్తికాంక్షతోనే ఈ రాజు ఈ విధంగా దానధర్మాలు చేస్తున్నాడు. ఇతని కర్మలు అన్నీ కీర్తికామదోష దూషితాలు. రైక్వుడు ఉన్నచోటనే ఉండి అన్నీ సాధించుకుంటున్నాడు. అతడికి గతాన్ని గురించి గాని, భవిష్యత్తును గురించిగాని ఆలోచనే లేదు. ఆత్మానుభవంతో విరాజిల్లుతున్నాడు" అన్నది.

ఈ రకంగా మాట్లాడుకుంటూ ఆ హంసలు రాజప్రాసాదము దాటి వెళ్ళి పోయినాయి. ఆ సంభాషణ అంతా విన్నాడు మహారాజు. అర్ధరాత్రి దాటింది. దేశం అంతా నిద్రపోయింది. కాని జానశ్రుతికి నిద్ర రాలేదు. హంసల సంభాషణే అతడి చెవులలో హోరెత్తుతోంది. ఇంతకాలం తానే గొప్పవాడిని అనుకున్నాడు. కాని కాదు. రైక్వుడు అనే మహానుభావుడు తనకన్న గొప్పవాడు. ఎవరాయన? ఎక్కడ ఉంటాడు? ఈ రకమైన ఆలోచనలతో రాత్రంతా గడిచిపోయింది.

ఉదయాన్నే లేచాడు మహారాజు. వైతాళికులు సుప్రభాతాలు మొదలుపెట్టారు. ఆచార ప్రకారం చేసే ఆ పొగడ్తలు అతన్నే మాత్రం తృప్తి పరచలేదు. వైతాళికు లంటున్నారు. "దానం చెయ్యటంలో నీకు నువ్వే సాటి మహారాజా ! మేలుకో. ఒక్కచేతినే వంద చేతులుగా చేసి దానం చేసే మహారాజువు నువ్వేనయ్యా ! నీకు సాటి ఇంకొకరు లేరు. మహారాజా ! నీ దగ్గర దానాలు తీసుకోవటానికి అర్థులు వచ్చే వేళయింది మేలుకో. తూర్పున సూర్యభగవానుడు ఉదయిస్తున్నాడు. ప్రపంచం నాలుగు మూలల నుండి దానం స్వీకరించటానికి జనం వస్తున్నారు. మేలుకో మహారాజా! మేలుకో !"

ఈ పొగడ్తలేవీ మహారాజుకు ఆనందాన్ని కలిగించలేదు. వైతాళికులారా ! ఆపండి. నన్ను ఊరికే పొగడుతూ ఆ పదాలకున్న విలువను పోగొట్టకండి. నాకన్నా గొప్పవాడు ఈ లోకంలో ఇంకొకడున్నాడు. ఎక్కడో కాదు. ఈ రాజ్యంలోనే ఉన్నాడు. రాజభటులారా ! తక్షణం మీరు వెళ్ళి ఆ మహానుభావుడు ఎక్కడ ఉన్నా సరే వెదికి అతని దర్శనభాగ్యం నాకు కలిగించండి" అన్నాడు.

ఆ మాటలు విని భటులు ఆశ్చర్యం పొందారు. రైక్వుడు అనే బండితోలే మహాత్ముడు ఎక్కడున్నాడు? ఎక్కడని వెదకటం? రాజాజ్ఞ పాటించి వెదకటానికి బయలుదేరారు భటులు. ఆ మహానుభావుడెవరో వారికి అంతు చిక్కలేదు. తిరిగి వచ్చి మహారాజుకు అదే మాట విన్నవించారు. ఇంకా విచారించాడు రాజు. మరికొంతమంది భటులను పిలిచి దేశం అంతా గాలించి ఆ మహానుభావుని జాడ కనుక్కోండి. సాధుపుంగవులు, బ్రహ్మజ్ఞానులు నివసించే ప్రాంతాలలో కూడా వెతకండి అన్నాడు.

విషయం పూర్తిగా అర్థమయింది భటులకు, ఆ మహానుభావుడెవరోకాని అతణ్ణి చూసేవరకు రాజు విశ్రమించడు. కాబట్టి అతని జాడ తెలుసుకుని రావల్సిందే అనుకుంటూ బయలుదేరారు. రాజ్యమంతా తిరిగారు. పల్లెపల్లె గాలించారు. చివరకు ఒక మారుమూల గ్రామంలో ఉన్నాడని తెలిసింది. అక్కడ ఒక బండి క్రింద విశ్రమించి ఉన్నాడా మహానుభావుడు. భటులు ఆయన దగ్గరకు పోయి 'స్వామీ ! బండితోలే రైక్వుడు అంటే మీరేనా?' అన్నారు. 'అవును నేనే' అన్నాడు రైక్వుడు.

బండి తోలుకుంటూ కాలక్షేపం చేసే నిర్లిప్తజీవి. ప్రశాంత చిత్తుడు. ఆ రైక్వుని దర్శనం చేసుకోవటానికి ఉవ్విళ్ళూరుతున్నాడు మహారాజు. వెంటనే ప్రయాణం కట్టాడు. ఆయన కోసం వెలలేని కానుకలు తీసుకుని రాజపరివారము కూడా వెంట బయలుదేరారు. రాజపరివారాన్ని చూసి ఆశ్చర్యపోయాడు రైక్వుడు. రాజు ఎందుకు వస్తున్నాడో తెలియలేదు. మొదట ఆలోచించి చూస్తే మహారాజు ఆధ్యాత్మికానుభూతి పొంది మనోనిశ్చలతను సాధించటానికి వచ్చాడని అర్థమయింది.

రైక్వుణ్ణి చేరటంతోనే మహారాజు రెండు చేతులూ జోడించి వినమ్రుడై, తాను అందించే కానుకలు స్వీకరించమన్నాడు. ఆనందానికి హేతువైన తత్త్వాన్ని బోధించమన్నాడు. ఆత్మజ్ఞానియైన రైక్వుణ్ణి ఈ కానుకలు ప్రలోభపెట్టలేక పోయినాయి. అతడు వాటిని స్వీకరించలేదు సరికదా "రాజా ! వెలలేని వస్తువులు నాకిచ్చి, తద్వారా నానుండి ఆత్మజ్ఞానం పొందుదామనుకోవటం అవివేకం. కానుకలతోనూ, రాజ్యాలతోనూ ఆత్మజ్ఞానాన్ని కొనలేవు. ఆత్మజ్ఞానమంటే బజారులో అమ్మే వస్తువు కాదు. నువు తెచ్చిన కానుకలు నీవెంట తీసుకుని వెళ్ళు, వీటికి ఇక్కడ విలువలేదు" అన్నాడు.

ఆ మాటలు విన్న రాజు మనస్సు చివుక్కుమంది. భౌతిక సంపదకు లొంగని రైక్వుని తలచుకుంటే అతనిమీద గౌరవం మరీ పెరిగిపోయింది. రాజుకు అసంతృప్తి ఎక్కువైపోయింది. వేదనా తప్త హృదయంతో తిరుగు ముఖం పట్టాడు రాజు. రైక్వుని దగ్గరకు వెళ్ళి వచ్చిన వాళ్ళని ఎంతోమందిని కలిశాడు. వారంతా అశాంత చిత్తంతో రైక్వుని దగ్గరకు వెళ్ళి ప్రశాంత చిత్తంతో తిరిగి వచ్చారు. ఈ విషయం తెలిసిన దగ్గర నుంచీ తన దౌర్భాగ్యాన్ని తలచుకుని చింతించసాగాడు.

ఈ రకంగా కొన్ని రోజులు గడిచాయి. రైక్వుని దర్శించటానికి మహారాజు మళ్ళీ వెళ్ళాడు. ఈ సారి రాజభటులులేరు. కానుకలు లేవు. సేవకులు లేరు. ఆర్భాటం లేదు. నిర్లిప్త హృదయంతో వినమ్రుడై వెళ్ళి రైక్వుని చెంత నుంచున్నాడు మహారాజు. తనను కటాక్షించి ఆత్మబోధకావించమని వేడుకున్నాడు.

మహారాజును చూశాడు రైక్వుడు. ఇప్పుడు రాజుముఖంలో నిర్మలత్వం కనిపిస్తోంది. రాజు ఆత్మజ్ఞానం పొందటానికి అర్హుడైనాడని గుర్తించాడు. పరిపూర్ణ హృదయంతో శిష్యునిగా స్వీకరించాడు. జానశ్రుతి మహారాజుకు రైక్వుడు ఈ విధంగా జ్ఞానోపదేశం చెయ్యటం మొదలుపెట్టాడు.

"రాజా ! ఆత్మను అనేకమంది అనేక విధాలుగా భావన చేస్తారు. ఆత్మ అనేది దేనివల్లా సృష్టించబడలేదు. సర్వసృష్టికీ అదే కారణం. ఈ సృష్టిలో అన్ని వస్తువులూ ఆత్మకు సంబంధించినవే. ఆత్మ అన్ని విషయాలకూ మూలకారణం. అన్నింటికీ ఆత్మే అధిష్టానం.

నువు చేసే దానాలకు ఎంతగానో గర్వపడిపోతున్నావు. అది చాలా అవివేకం. దానాలు చెయ్యి. గర్వంతోనూ దర్పంతోనూ కాదు. ఇదంతా నీ ప్రయోజకత్వం అనుకోవద్దు. దీనివల్ల అహంకారం జనిస్తుంది. ఆత్మవినాశనానికి దారి తీస్తుంది. నువు ఇవ్వగలిగింది దానంగా ఇవ్వుకాని కీర్తికాంక్షతో కాదు. సర్వవ్యాపి అయిన సర్వేశ్వరుడు నీకందించిన దానిని, ఆత్మస్వరూపులైన అందరికీ ఇస్తున్నానని భావించి ఇవ్వు. అది నీ కర్తవ్యంగా భావించు. దానివల్ల ఆత్మానుభూతి కలుగుతుంది" అన్నాడు.

ఆ మాటలు విన్న రాజు ఆనంద పరవశుడైనాడు. రైక్వునికి వేయి పాడిఆవుల్ని, విలువైన కానుకలను, అమూల్యమైన హారాలను, రథాలను, గుర్రాలను కానుకగా ఇచ్చి తన కుమార్తెనిచ్చి వివాహం చేశాడు.

ఈ రకంగా దానధర్మాలు చేసినంత మాత్రంచేత మోక్షం రాదు. సద్గురువును ఆశ్రయించాలి. జ్ఞానసముపార్జన చెయ్యాలి. మోక్షమార్గాన్ని పట్టుకోవాలి. అందుకే సద్గురువు యొక్క కృపాకటాక్ష వీక్షణాలు పొందనిదే ప్రయోజనం లేదు.

**న భోగే నయోగే నవావాజిరాజౌ**
**నకాంతా ముఖేనైవ విత్తేషు చిత్తం ।**
**మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥** **7**

నేను జీవితంలో సుఖాలు, భోగాలు అన్నీ అనుభవించాను. యోగంమీద గాని, కర్మమీద గాని, స్త్రీల మీద గాని నాకు ఆశలేదు. నాకు దేని మీదా ఆశలేదు. నాకు దేనిమీదా ఆశలేదు. పూర్తిగా విరాగినైనాను. నేను చెయ్యవలసిందంతా చేసేశాను. గురువుమీద మాత్రం నమ్మకం లేదు అంటాడు. అలా కుదరదు. ఎందుకంటే గురూపదేశం లేనిదే మోక్షం మాత్రం రాదు. ఎత వైరాగ్యమున్నా ఉపయోగంలేదు. గురూపదేశం ఉండి తీరాలి.

గురూపదేశం అంటే మా తండ్రి ఉపదేశం చేశాడనో, తాత ఉపదేశం చేశాడనో చెబుతారు. వీళ్ళు కేవలం మంత్రగురువులు. మంత్రంవరకు ఉపదేశం చెయ్యగలరు. అనుష్ఠాన విధానం, మంత్రార్థం వివరించగలరు. దానివల్ల మనం జపం చేసి భగవంతుడి అనుగ్రహం సంపాదించగలుగుతాం. కావలసిన కోరికలు లౌకికమైనవి తీర్చుకోగలుగుతాం. అంతకన్నా ఏ ఉపయోగం ఉండదు. ఈ మాట చెబితే "మా తాత సామాన్యుడు కాదు. ఆయన పిలిస్తే ఆంజనేయుడు పలుకుతాడు. మా నాన్న జపం చేస్తే వినాయకుడు దర్శనమిస్తాడు." అంటారు. దానివల్ల ప్రయోజనం ఏమిటి? పూర్వకాలంలో అనేకమంది రాక్షసులు తపస్సు చేశారు. బ్రహ్మాదిదేవతలు ప్రత్యక్షమై అనేకమైన వరాలు వాళ్లకిచ్చారు. దానివల్ల ఈ లోకంలో కావలసిన సిరిసంపదలు, భోగభాగ్యాలు, అధికారము లభిస్తాయి. అంతేకాని మోక్షం రాదు. మోక్షమివ్వగలవాడు పరమేశ్వరుడొక్కడే. అందుకే నిరాకారుడు, నిర్గుణ స్వరూపుడు అయిన పరమేశ్వరుణ్ణి ఆరాధించాలి. దానికి సద్గురువు యొక్క అనుగ్రహం కావాలి. కేవలము వైరాగ్యం ఉన్నంతమాత్రం చేత మోక్షం రాదు. జ్ఞానం కావాలి. అలా అని జ్ఞానవైరాగ్యాలున్నంత మాత్రంచేత మోక్షం రాదు. మోక్షమార్గాన్ని చూపే సద్గురువు ఉండితీరాలి.

అరణ్యేనవా స్వస్యగేహే న కార్యే
న దేహే మనోవర్తతేమేత్వ నర్ఘే ।
మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే
**తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥** **8**

"అరణ్యాలకు వెళ్ళాలని లేదు. ఇంట్లో ఉండాలనీ లేదు. ఏ పని చెయ్యాలనీ లేదు. దేనిమీద ధ్యాస లేదు. ఈ శరీరం మీద కూడా ధ్యాసలేదు" అని చాలామంది చెబుతుంటారు. ఇదంతా నిజమైన వైరాగ్యమా ? ఇలా చెప్పేవాళ్ళలో చాలామందిది మిథ్యావైరాగ్యం. అసలు వైరాగ్యము అనేది రెండు రకాలు 1. శ్మశాన వైరాగ్యం 2. ప్రసూతి వైరాగ్యం. ఎవరైనా పోయినప్పుడు మనకి అనిపిస్తుంది. "రేపో మాపో మనమంతా కూడా పోయేవాళ్ళమే. ఎవరు శాశ్వతం?" అని. కాని కొద్దిసేపటికే మళ్ళీ మామూలు స్థితికి వచ్చేస్తాడు మానవుడు. అలాగే ప్రసూతి వైరాగ్యంకూడా. ఇంకొక వైరాగ్యం కూడా ఉంది. ఏదైనా ఆధ్యాత్మిక ఉపన్యాసం వింటున్నప్పుడు "ఆయన చెప్పినదంతా నిజమే. ఏది శాశ్వతం ? భార్య, పిల్లలు, ఇల్లు, సంసారం. అంతా మిథ్య. ఏమీ లేదు" అనిపిస్తుంది. అక్కడ నుంచి లేచి వళ్ళు దులుపుకునేప్పటికి, అప్పటిదాకా ఉన్న వైరాగ్యమంతా అక్కడే పడిపోతుంది. మళ్ళీ ఇల్లు, భార్య, పిల్లలు అంతా గుర్తుకు వస్తారు. ఇలాంటివన్నీ మిథ్యా వైరాగ్యం. అంటే అది స్వతఃసిద్ధంగా వచ్చిన వైరాగ్యంకాదు. కేవలము పరిస్థితుల ప్రభావం వల్ల వచ్చింది. పరిస్థితులు మారగానే వైరాగ్యస్థితి కూడా మారిపోతుంది. దీనివల్ల ప్రయోజనం లేదు. అసలైన వైరాగ్యం కావాలి. అంటే నిజంగానే లౌకిక విషయాల మీద విరక్తి రావాలి. అది పూర్వజన్మల పుణ్యఫలం. అటువంటి వాడికి గురువుమీద నమ్మకముండదు.

ధనవంతుడికి దానగుణముండదు. విద్యావంతుడికి వినయం ఉండదు. వైరాగ్యమున్న వాడికి గురువుమీద నమ్మకముండదు. సద్గురువు మనని పట్టి పీడిస్తున్న అరిషడ్వర్గాలన్నింటినీ ఒక్కొక్కటిగా వదిలిస్తాడు. వైరాగ్యాన్ని కలిగిస్తాడు. వైరాగ్యం రావటమనేది చాలా కష్టం. అటువంటి వైరాగ్యం చాలా తేలికగా లభించింది ఇప్పుడు. సద్గురువు కృప గనక ఉంటే మోక్షద్వారాలు తెరచుకుంటాయి. అందుకే సద్గురువు కావాలి.

అనర్ఘ్యాణి రత్నాని భుక్తాని సమ్యక్
సమాలింగితా కామినీ యామినీషు ।

మనశ్చేన్నలగ్నం గురోరంఘ్రిపద్మే
తతః కిం తతః కిం తతః కిం తతః కిం ॥ 9

కొంతమంది భోగాలను అతిగా అనుభవిస్తారు. వాళ్ళంటారు "జీవితంలో నేను అన్నీ అనుభవించాను. వెలలేని భోగభాగ్యాలు అనుభవించాను. ఎన్నో రాత్రులు సుఖించాను. ఇప్పుడు ఇంకా ఈ సుఖాలమీద నాకు ఆశ లేదు."

ఈ రకమైనవారు కోరికలను పూర్తిగా అనుభవించి, తృప్తిచెంది, ఇంక వద్దు. అందులో ఏమీ లేదు. అనే భావానికి వచ్చారు. వీరు సానపట్టని వజ్రంలాంటివారు. సద్గురువు కృప గనక వీరికి దొరికితే సానపట్టిన వజ్రం అవుతారు. మోక్షద్వారాలు వాటంతటవే తెరుచుకుంటాయి. జీవితం ధన్యమవుతుంది. పునర్జన్మ ఉండదు. జన్మరాహిత్యం కలుగుతుంది. వీరియొక్క జీవాత్మ ఆ పరమాత్మలో గాలిలో గాలిలాగా, నీటిలో నీరులాగా లీనమైపోతుంది. జీవాత్మ పరమాత్మలు రెండూ ఒకటై పోతాయి.

ఈ రకంగా విద్య, వినయము ఉన్నవాడు, ధనము దానగుణము ఉన్నవాడు, వైరాగ్యం ఉన్నవాడు, వీరంతా మనకన్న ఒకటి రెండు మెట్లుపైన ఉన్నారు. వారికి గనక సద్గురువు లభించినట్లైతే మోక్షప్రాప్తి కలుగుతుంది.

**గురోరష్టకం యః పఠేత్పుణ్యదేహీ**
**యతిర్భూపతిర్బ్రహ్మచారీ చ గేహీ ।**
**లభేద్వాంచితార్థం పదం బ్రహ్మ సంజ్ఞం**
**గురోరుక్తవాక్యే మనోయస్యలగ్నమ్ ॥** 10

యతీశ్వరుడైనా, రాజైనా, బ్రహ్మచారి అయినా, గృహస్థు అయినా, ఎవరైనా సరే **గురు అష్టకాన్ని** పఠించినవాడు పుణ్యాత్ముడై, గురువు ఉపదేశించిన మహావాక్యాల మీద మనసు లగ్నం చేసి, ఆప్తకాముడై, పూర్ణకాముడై '**బ్రహ్మము**' అనబడే పరమ పదాన్ని పొందుతాడు.

## 7. దత్తాత్రేయుడు

బ్రహ్మ మానసపుత్రుడు 'అత్రి' సప్తఋషులలో ఒకడు. స్వాయంభువ మనువు భార్య శతరూప. వీరికి ఆకూతి, దేవహూతి, ప్రసూతి అని ముగ్గురు కుమార్తెలు. వీరిలో దేవహూతిని కర్దముడికిచ్చి వివాహం చేశాడు స్వాయంభువ మనువు. వీరికి తొమ్మిదిమంది కుమార్తెలు 1. కల, 2. అనసూయ, 3. శ్రద్ధ, 4. హవిర్భువు,

5.గతి, 6. క్రియ, 7. ఊర్ధ్వ, 8. చితి, 9. ఖ్యాతి. కపిలుడు అనేక కుమారుడు కలిగారు. వీరిలో రెండవ కుమార్తె అయిన అనసూయను బ్రహ్మ మానసపుత్రుడయిన అత్రిమహర్షికిచ్చి వివాహం చేశారు. అత్రి అనసూయలకు చాలాకాలం పిల్లలు లేరు. సంతానార్ధం అత్రిమహర్షి ఘోరమైన తపస్సు చేశాడు. ఆయన తపస్సుకు మెచ్చి త్రిమూర్తులు ప్రత్యక్షమైనారు. ప్రత్యక్షమైన త్రిమూర్తులను చూసి నేను ఒక్కరినే ప్రార్ధించాను. మీరు ముగ్గురు ఎందుకు వచ్చారు? అన్నాడు మహర్షి. ఆ మాటలు విన్న త్రిమూర్తులు "ఓ అత్రి మహర్షీ ! మేము ముగ్గురుము ఒకటే. మాకు భేదం లేదు. నువ్వు కోరినట్లుగానే వరమిస్తున్నాము. మా అంశలతో నీకు కుమారులు పుడతారు." అన్నారు.

అనసూయాదేవి మహాపతివ్రత. ఒకసారి త్రిమూర్తులు తమ వాహనాలెక్కి మేరు పర్వతానికి వెడుతుండగా, మార్గం మధ్యలో వాహనాలు ఆగిపోయినాయి. వారు ఎంత ప్రయత్నించినా అవి కదలలేదు. అప్పుడు గరుత్మంతుడు శ్రీమహావిష్ణువుతో "స్వామీ ! ఇక్కడ అత్రిమహర్షి ఆశ్రమం ఉన్నది. అతని భార్య అనసూయ చాలా పతివ్రత. ఈ ఆశ్రమం మీదుగా ఎవరూ పోరాదు." అని చెప్పి వేరు మార్గాన వెళ్ళిపోయాడు. అయితే అనసూయ పాతివ్రత్యం ఎంతటిదో పరీక్షించాలి అనిపించింది త్రిమూర్తులకి.

ఒకరోజున అపరాహ్ణంవేళ అత్రిమహర్షి స్నానసంధ్యాదులు పూర్తి చేసుకోవటానికి నదీ తీరానికి వెళ్ళాడు. ఆ సమయంలో ముగ్గురు మునులు ఆశ్రమానికి వచ్చారు. వచ్చినవారు బాగా అలసిపోయి ఉన్నారు. అనసూయాదేవి వారిని సాదరంగా ఆహ్వానించి, భోజనం చెయ్యమన్నది. అప్పుడు వారు "మాకు చాలా కఠినమైన నియమాలున్నాయి. అవన్నీ పాటిస్తానని మాట ఇస్తే మేం భోజనం చేస్తాము" అన్నారు. సరేనంది అనసూయ. ఆ ముగ్గురికీ విస్తళ్ళు వేసింది. వడ్డన పూర్తయింది. అప్పుడు వారు "నువ్వు వివస్త్రగా వచ్చి మాకు ఆపోసన పోస్తేనే మేం భోజనం చేస్తాము. ఇది మా నియమము" అన్నారు. ఆ మాటలు విన్న అనసూయ నివ్వెరపోయింది. వణికిపోయింది. నోటమాట రాలేదు. అపరాహ్ణం వేళ ఆకలితో ఇంటికి వచ్చి భోజనానికి కూర్చున్న పుణ్యమూర్తులయిన తాపసులను ఆరాధించాలా? ఇటువంటి నికృష్టపు నియమాలు గల వీరిని తరిమికొట్టాలా? ఏం పాలుపోలేదు. ఒక్కక్షణం ఆలోచించింది. భర్తను తలచుకుని కొద్దిగా నీరు తెచ్చి ఆ ముగ్గురిమీదా చల్లింది.

వారు ముగ్గురూ పసిపాపలై పోయారు. ఆ ముగ్గురు పిల్లలనీ ముద్దులాడి, ఊయలలో వేసి ఊపుతోంది. అత్రిమహర్షికి ఈ విషయం తెలిసి చాలా ఆనందించాడు.

కాలం గడిచిపోతోంది. అక్కడ తమ భర్తల రాక కోసం ఎదురుచూస్తున్న సరస్వతి, లక్ష్మి, పార్వతులు జరిగిన సంగతి తెలుసుకుని, భర్తలను వెతుక్కుంటూ అత్రిమహర్షి ఆశ్రమానికి వచ్చారు. వారికి స్వాగత సత్కారాలందించింది అనసూయాదేవి. వచ్చినవారు అనసూయాదేవి ఎదుట కొంగు చాచి పతిబిక్ష పెట్టమని వేడుకున్నారు. మీ ఇంట్లో ఊయలలో ఊగుతున్నవారే మా భర్తలు త్రిమూర్తులు అన్నారు. త్రిశక్తుల కోరిక మన్నించి వారి భర్తలను వారికి అందించింది అనసూయాదేవి.

పూర్వకాలంలో ప్రతిష్ఠానపురంలో కౌశికుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు చాలా గొప్పపండితుడు. కాని బాగా దురభ్యాసాలకు బానిస అయ్యాడు. అతడి భార్య సుమతి గొప్ప పతివ్రత. ఇతడికి కుష్ఠు బాగా ముదిరిపోయింది. కాళ్ళు చేతులు పని చెయ్యవు. తనంత తాను నడవలేడు. ఏ పనీ చేసుకోలేడు. అటువంటి స్థితిలో ఒకరోజున సుమతి అతనికి స్నానం చేయించి మంచంమీద పడుకోబెట్టి, ఇంటి పనులు చూసుకుంటోంది. అలా పడుకుని వీధిలో వచ్చే పోయేవాళ్ళని చూస్తున్నాడు కౌశికుడు. అటువైపుగా ఒక వేశ్య పోతున్నది. ఆవిడ మీద మనసు పడ్డాడు. లేవలేడు. కదల్లేడు. కోరిక ఆగటం లేదు. ఏం చెయ్యాలి ? చివరకు తన కోరికను భార్యకు చెప్పి, తనను ఆవేశ్య ఇంటికి తీసుకుపొమ్మన్నాడు. ఆ మాటలు విన్న సుమతి చాలా విచారించింది. దుఃఖించింది. చేసేది లేక చివరకు చీకటి పడ్డాక, కదల్లేని భర్తను గంపలో పెట్టుకుని, ఆ చీకట్లో సానివాడకు బయల్దేరింది. చీకట్లో దారి తప్పి స్మశానంలోంచి వెడుతోంది.

ఆదేశాన్ని పాలించే రాజుగారి భవనంలో దొంగతనం జరిగింది. రాజభటులు దొంగలను వెతుకుతూ బయల్దేరారు. అడవిలో మాండవ్యుడు అనే మహర్షి ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకుంటున్నాడు. దొంగలు అక్కడికి వచ్చి, తాము దొంగిలించిన ఆభరణాలతో పాటుగా మహర్షి ఆశ్రమంలో దాక్కున్నారు. రాజభటులు వచ్చి ఆభరణాలు, దొంగలతోపాటుగా మహర్షిని కూడా రాజా స్థానానికి తీసుకుపోయారు. రాజుగారు మాండవ్య మహర్షికి కొరత వేయించాడు. కొరత అనేది ఒక క్రూరమైన మరణ శిక్ష, నేలలో శూలంపాతి, దోషిని దానిమీద నుంచో పెడతారు. ఈ శూలం దోషి శరీరంలోకి దిగిపోతుంది. తీయటానికి రాదు. దోషి కదల్లేడు మెదల్లేడు. అలా మరణించాల్సిందే. శిలువ వెయ్యటంలాంటిదే ఈ శిక్ష కూడా.

మాండవ్యుడు అక్కడ కొరత వేయబడి ఉన్నాడు. ఆ చీకట్లో సుమతి నెత్తిన బుట్టలో ఉన్న కౌశికుడి కాలు మహర్షికి తగిలి అతని గాయం రేగింది. అతని బాధ భరించరానిదయింది. వెంటనే ఆయన "నన్ను అకారణంగా బాధించినవాడు రేపు సూర్యోదయానికల్లా తలపగిలిచస్తాడు" అని శాపం పెట్టాడు. ఆ మాటలు విన్న సుమతి సూర్యోదయం కాకుండా చేసింది.

కాలం గడుస్తోంది. ఎంతకీ సూర్యోదయం కావటం లేదు. లోకాలన్నీ చీకట్లో అలమటిస్తున్నాయి. దేవతలంతా బ్రహ్మదగ్గరకు వెళ్ళి లోకాలకు వెలుగులు ప్రసాదించమని వేడుకున్నారు. అనసూయ దగ్గరకు వెళ్ళమన్నాడు బ్రహ్మ. దేవతల మొర ఆలకించి సూర్యోదయం చేయించి, కౌశికుణ్ణి రక్షించింది అనసూయ. ఈ సంఘటనకు ఆనందించిన త్రిమూర్తులు ప్రత్యక్షమై ఏదైనా వరం కోరుకోమన్నారు. అనసూయ త్రిమూర్తులకు నమస్కరించి "మీరు నాకు కుమారులై జన్మించండి" అని కోరింది. 'తథాస్తు' అన్నారు త్రిమూర్తులు. కాలక్రమాన బ్రహ్మయొక్క అంశతో చంద్రుడు, రుద్రుని అంశతో దుర్వాసుడు, బ్రహ్మ రుద్రాంశలతో శ్రీమన్నారాయణుడు దత్తుడుగా అనసూయ గర్భాన జన్మించారు. ఈ దత్తుడే దత్తాత్రేయుడు అని ఖ్యాతి పొందాడు. ఇతడు దుష్టశిక్షకుడు. శిష్టరక్షకుడు. పరమయోగి. భక్తులపాలిట కల్పతరువు. గురుసంప్రదాయానికి నాంది పలికినవాడు.

చిన్నతనంలోనే అనేక మహిమలు చూపినవాడు. ఆశ్రమవాసులంతా ఇతడు సామాన్యుడు కాడనీ, ఆత్మయోగం కావాలంటే ఇతన్నే పట్టుకోవాలనే నిర్ణయానికొచ్చారు. బాలదత్తుడు ఎక్కువ కాలం ఏకాంతంగా గడుపుతూ యోగనిష్ఠలో ఉండేవాడు. ఆశ్రమవాసులంతా అతని చుట్టూ చేరి తమని శిష్యులుగా స్వీకరించమని ప్రార్థించారు. వాళ్ళ ప్రార్థన నిజమో కాదో పరీక్షించాలని సంకల్పించిన దత్తాత్రేయుడు వారందరూ చూస్తుండగానే ఒక సరస్సులో మునిగాడు. ముని కుమారులంతా సరస్సు ఒడ్డున కూర్చున్నారు. దత్తుడు నీట మునిగాడు. ఎంతకీ బయటకు రాడు. ఇలా రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడిచాయి. దత్తుడు ఇక రాడు అని కొంతమంది వెళ్ళిపోయారు. మిగిలినవారు అలాగే సరస్సువద్దున కూర్చున్నారు. వంద సంవత్సరాలు గడిచాయి. అయినా మునికుమారులు అలాగే ఉన్నారు. వాళ్ళ పట్టుదలకు సంతోషించాడు దత్తుడు. ఐనా ఇంకా పరీక్షించాలనిపించింది. ఒక చేత్తో కల్లుముంత, ఇంకొక చేతిలో అందమైన వనితలతో బయటకు వచ్చాడు. ఆ స్త్రీ వంటి మీద

బట్టలు కూడా సరిగాలేవు. ఆమెతో సరస సల్లాపాలలో మునిగి తేలుతున్నాడు. ఆ స్థితిలో అతన్ని చూసి "ఇతడు ధర్మభ్రష్టుడు. ఇంకా మనకేం యోగం చెబుతాడు" అని అసహ్యించుకుని ముని బాలకులు కొంతమంది తిరిగి వెళ్ళిపోయారు. ఇంకా కొద్దిమంది మాత్రం అక్కడే ఉండి "స్వామీ ! ఇదంతా నీ మాయ. మాకు తెలుసు. మమ్మల్ని కరుణించు" అని వేడుకున్నారు. వాళ్ళని శిష్యులుగా స్వీకరించి ఆత్మయోగాన్ని బోధించాడు దత్తాత్రేయుడు. ఈయన ఒక పట్టాన ప్రసన్నుడుకాడు. అనేక రకాలుగా పరీక్షించి, ఆ పరీక్షలో నెగ్గిన వారినే శిష్యులుగా స్వీకరిస్తాడు.

దత్తాత్రేయుడు ఒకరోజున తల్లి దగ్గరకు వచ్చి తాను సహ్యాద్రికి వెళ్ళి తపస్సు చేసుకుంటాననీ, అనుజ్ఞ ఇమ్మనీ అడిగాడు. కుమారుడు సాక్షాత్తు త్రిమూర్తి స్వరూపుడు అని తెలిసికూడా పుత్రవ్యామోహంతో "కుమారా ! నువ్వు యోగివే కావచ్చు. అందరికీ గురువువే కావచ్చు. అయినా నాకు మాత్రం కుమారుడివే. నీకు ఈ చర్మ దేహం ఇచ్చింది నేను. ఒకవేళ నువ్వు వెళ్ళ తలచుకుంటే, నేనిచ్చిన ఈ చర్మం నాకిచ్చేసి, ఆ తరువాత వెళ్ళు" అన్నది. ఆ మాటలు విన్న దత్తుడు చిరునవ్వు నవ్వి గోళ్ళతో శరీరాన్ని పరపరా చీల్చి, చొక్కా విప్పినట్లుగా చర్మవిప్పి తల్లి చేతుల్లో పెట్టాడు. అనసూయాదేవికి జ్ఞానోదయమయింది. దత్తుడు కేవలము తన కుమారుడే కాదు. సాక్షాత్తు త్రిమూర్తి స్వరూపుడు. ఈ విషయం తెలుసుకుని "గురుదత్తా ! జగత్తులను చీకటిలో నుండి వెలుగులోకి నడిపించటానికి అవతరించిన జగద్గురువువు నీవు. నీకు అవధులు లేవు. జన్మజరామృత్యువులు లేవు.

అజ్ఞానంతో నిండిపోయిన నాకు ఈ సత్యాన్ని తెలియచేశావు. నీ ఇష్టానుసారమే సహ్యాద్రికి వెళ్ళి భక్తకోటిని అనుగ్రహించు" అని ఆశీర్వదించి పంపింది.

ఆయన ప్రవృత్తి కొత్తరకంగా ఉంటుంది. ఆయన పనులు ఊహల కందవు. ఒకసారి శాంతమూర్తి అయిన యతీశ్వరుడుగా ఉంటాడు. ఇంకోసారి బీభత్సరూపంతో ఉంటాడు. మరొకసారి వ్యసనాలకు బానిస అయినట్లుగా ఉంటాడు. ఏ రూపంలో ఉన్నా ఆయన మహాయోగే. ఆయన లీలలు చిత్రాతిచిత్రం.

ఒకసారి జంభాసురుడు అనే రాక్షసుడు దేవతల మీదకి దండెత్తాడు. దేవదానవ యుద్ధం భీకరంగా జరుగుతోంది. యుద్ధం చాలాకాలం సాగింది. కొన్ని వందల సంవత్సరాలు గడిచినాయి. దేవతల పరాక్రమం సన్నగిల్లిపోతోంది. దానవులు విజృంభిస్తున్నారు. ఆ సమయంలో ఏం చెయ్యాలో తోచక బృహస్పతిని ఆశ్రయించాడు

ఇంద్రుడు. సహ్యాద్రిమీద ఉన్న దత్తాత్రేయుణ్ణి శరణువేడమని చెప్పి "దేవేంద్రా ! దత్తాత్రేయుడు కఠినమైన పరీక్షలు పెడతాడు జాగ్రత్త. ఆయన బహువికృతంగా, బీభత్సంగా, నింద్యమైన ఆచారంలో కనిపించచ్చు. జాగ్రత్త. ఏ రకంగా ఉన్నా ఆయన నిర్మలుడే అని గుర్తుంచుకో" అన్నాడు.

దేవతలను వెంటపెట్టుకుని సహ్యాద్రి చేరాడు ఇంద్రుడు. ఆ సమయంలో గంధర్వులు గానం చేస్తున్నారు. దత్తుడు కల్లు సేవిస్తున్నాడు. అర్ధనగ్నంగా ఉన్న సుందరాంగులతో సరసాలాడుతున్నాడు. దేవతలు స్వామికి నమస్కరించారు. పరిచారికలతో పాటు మధుమాంసాలనందించారు. దత్తుడు వళ్ళు తెలియని స్థితిలో ఉన్నాడు. ఇంద్రుని ముఖాన ఉమ్మివేశాడు. ఇంద్రుడు శాంత స్వభావంతో, వినమ్రుడై స్వామిని సేవించాడు. కొంతసేపటికి ఇంద్రుణ్ణి చూసి ఏం కావాలి ? అన్నాడు స్వామి. జరిగిందంతా చెప్పి, దేవతలకు విజయాన్ని ప్రసాదించమన్నాడు ఇంద్రుడు.

ఆ మాటలు విన్న దత్తుడు పకపకా నవ్వి "ఎంత పిచ్చివాడినయ్యా దేవేంద్రా ! ఉంచుకున్న దాని మత్తులో పడి, కల్లుకడవలలో తేలే నన్ను పట్టుకుని రాక్షసులను జయించే శక్తి ఇమ్మని అడుగుతున్నావు. కుక్క తోక పట్టుకుని గోదావరి ఈదినట్లుంది నీ పని" అన్నాడు. ఆ మాటలు విన్న దేవేంద్రుడు "స్వామీ ! నువ్వు జగద్గురువువు. విద్యామూర్తివి. జ్ఞానజ్యోతివైన నీకు ధర్మాధర్మాలంటవు. నీవు అనఘుడవు. హరివి. ఈమె సాక్షాత్తు లక్ష్మీదేవి. ఈవిడ ప్రకృతి, నువ్వు పురుషుడవు. నువ్వు తప్ప మాకు వేరు దిక్కు లేదు." అన్నాడు.

కొంచెం ఆలోచించాడు దత్తుడు. "దేవేంద్రా! నువ్వు ఇంతగా ప్రాధేయ పడుతున్నావు కాబట్టి చెబుతున్నాను. నేను ఈ చోటు వదలి రాను. నీ శత్రువులను గనక ఇక్కడికి తీసుకువస్తే నాచేతనయింది చేస్తాను" అన్నాడు. దేవతలు తిరిగి యుద్ధభూమికి వెళ్ళి రాక్షసులను యుద్ధానికి పిలిచారు. వాళ్ళని వెక్కిరించారు. హేళన చేశారు. దాంతో రాక్షసులు కోపోద్రిక్తులై దేవతల వెంట పడ్డారు. దేవతలు సహ్యాద్రివైపు పరుగుపెట్టారు. దేవతలను తరుముతూ సహ్యాద్రి చేరారు రాక్షసులు.

ఆ సమయంలో సహ్యాద్రిమీద అనఘాదేవితో సరసాలాడుతున్నాడు దత్తాత్రేయుడు. రాక్షసులకు అనఘాదేవిని చూసేప్పటికి మతిపోయినంత పనయింది. ఆయన ఉన్మత్తుడు. ఆవిడ అర్ధనగ్నంగా ఉన్న జగన్మోహిని. దేవతలతో యుద్ధం మాట మరచిపోయారు రాక్షసులు. ఒక్క ఉదుటున పోయి ఉన్మత్తుడైన దత్తుణ్ణి ప్రక్కకు లాగి

పడేశారు. ప్రక్కన పడిపోయాడు దత్తుడు. ఒక పల్లకి తెచ్చి, ఆ స్త్రీ మూర్తిని దానిలో కూచోబెట్టి, పల్లకి మోసుకుంటూ పోతున్నారు. అది చూసిన దత్తాత్రేయుడు ఒక్కసారిగా నవ్వి "దేవతలారా ! మీ అదృష్టం బాగుంది. లక్ష్మి వీరిలో ఆరు స్థానాలు దాటి నెత్తికెక్కింది. ఇక వారికి దక్కదు. మీకేం భయం లేదు" అన్నాడు. ఆ మాటలు దేవతలకు ఏమీ అర్థం కాలేదు. అప్పుడు వారు స్వామీ ! ఆరు స్థానాలేమిటి ? లక్ష్మీదేవి ఎక్కడ ఉంటే ఫలితం ఏమిటి? అని అడిగారు. దత్తాత్రేయుడు చెప్పటం మొదలుపెట్టాడు. "దేవతలారా ! లక్ష్మీదేవి ఏ స్థానంలో ఉంటే ఏ ఫలితం ఉంటుందో చెబుతాను వినండి.

1. పాదస్థానంలో ఉంటే – పెద్ద పెద్ద భవనాల్లో నివాసం ఉంటాడు
2. తొడల్లో ఉంటే – వస్త్ర సమృద్ధి, ధనసమృద్ధి
3. గుహ్యస్థానంలో ఉంటే – భార్యాసౌఖ్యం
4. రొమ్మున ఉంటే – మనోరథాలు సిద్ధిస్తాయి
5. కంఠస్థానంలో ఉంటే – ఆభరణ సమృద్ధి, బంధుసమృద్ధి
6. ముఖంలో ఉంటే – అన్నసమృద్ధి, ఆజ్ఞాబలం. మధురమైన కవితాశక్తి

ఈ ఆరుస్థానాలను దాటి ఏడవ స్థానమైన తలపైకి ఎక్కిందంటే, ఇక వాడిలో నిలవదు. దేవతలారా ! ఇక లక్ష్మి వీరిని వదిలేస్తుంది. ఆలస్యం చెయ్యకుండా వారిని సంహరించండి" అన్నాడు. స్వామి చెప్పినదే తడవుగా దేవతలు బాణాలు వేసి రాక్షసులను సంహరించారు. ఈ రకంగా దేవతలను అనేక రకాలుగా పరీక్షించి, చివరకు వారిని అనుగ్రహించాడు దత్తాత్రేయుడు.

దత్తాత్రేయుడు సామాన్యుడు కాదు. ఈయనకు ఇరవై నాలుగుమంది గురువులున్నారు. అంటే ప్రకృతిలో కనుపించిన ప్రతిజీవి ఈయనకు గురువే. ఈ విషయం ఆయనే స్వయంగా యదువుకు చెప్పాడు.

1. భూమి, 2. వాయువు, 3. ఆకాశము, 4. నీరు, 5. అగ్ని, 6. చంద్రుడు, 7. సూర్యుడు, 8. పావురాలు, 9. అజగరము, 10. సముద్రము, 11. లేడి, 12. ఏనుగు, 13. మిడత, 14. తుమ్మెద, 15. చేప, 16. మధుహారి, 17. వేశ్య, 18. లకుముకిపిట్ట, 19. బాలుడు, 20. బాలిక, 21. శరకారుడు, 22. పాము, 23. సాలీడు, 24. కీటకము. ఇవన్నీ ఆయనకు ఏ విధంగా గురువులయినాయో చూద్దాం.

**1. భూమి :** రాజా ! జనులు తనను తన్నినా, తవ్వినా మరెన్నో రకాలుగా హింసించినా భూమాత చలించదు. కోపగించదు. ఓర్చుకుని ఉంటుంది. చెట్లు చేమల రూపంలో, పర్వతాల రూపంలో ఉండే భూమివల్ల పరోపకారం జరుగుతుంది. కాబట్టి సాధకుడు కూడా భూమిలాగా క్షమాగుణత్వము పరోపకారత్వము గలిగి ఉండాలి అని నేర్చుకున్నాను.

**2. వాయువు :** నిస్సంగత్వము, నిర్లేపత్వాలను వాయువులవల్ల నేర్చుకున్నాను. ప్రాణవాయువు ఆహారం తీసుకుంటుంది. కాని దానికి ఏ రకమైన విషయవాంఛలు ఉండవు. అలాగే సాధకుడు కూడా జ్ఞానాన్ని సంపాదించటం కోసం ఆహారం తీసుకోవాలి. అంతేకాని విషయవాంఛలలో చిక్కుకోరాదు. జ్ఞానం సంపాదించాలంటే దేహం కావాలి. దేహం నిలవాలంటే ప్రాణం కావాలి. ప్రాణం నిలబడాలంటే ఆహారం కావాలి. కాబట్టి సాధకుడు ప్రాణం నిలవటం కోసం పరిమితమైన ఆహారం తప్పక తీసుకోవాలి.

ఇక బయట ఉన్న వాయువును చూసినట్లైతే, అది చల్లదనము, వెచ్చదనము వంటి అనేక గుణాలుగల వస్తువులతో సాంగత్యం పొందుతూ ఉంటుంది. అయినప్పటికీ ఆ గుణాలు దానికి ఏ మాత్రం అంటవు. అలాగే సాధకుడు కూడా విషయ స్పర్శ లేకుండా ఉండాలి.

వాయువుకు సహజమైన వాసన ఏదీలేదు. మంచి వస్తువులు, పూలమీద నుంచి వస్తే మంచి వాసన వస్తుంది. చెడ్డ వస్తువుల మీంచి వస్తే చెడువాసన వస్తుంది. అలాగే సాధకుడు కూడా గుణాలు తనకు అంటినట్లుగా కనపడాలి. అంతేకాని నిజంగా వాటిని అంటించకోరాదు. అతను ఎల్లప్పుడూ ఆత్మావలోకనంలోనే ఉండాలి.

**3. ఆకాశము :** ఆకాశము సర్వవ్యాపకమైనది. అది ఘటాదులలో చేరినప్పటికీ వాటితో సాంగత్యము పొందదు. అలాగే సాధకుడు దేనితోనూ సాంగత్యము పొందకుండా సర్వత్రా బ్రహ్మభావన చెయ్యాలి. అన్నింటిలోనూ పరబ్రహ్మనే చూడాలి. ఆకాశంలో మేఘాలు కదలుతూ ఉంటాయి. కాని ఆకాశం మేఘాలచేత అంటుకోబడదు. అలాగే గుణాలచేత ఆత్మపురుషుడు అంటబడడు.

**4. జలము :** జలం నిర్మలంగా ఉంటుంది. స్వచ్ఛంగా ఉంటుంది. మధురంగా ఉంటుంది. ఇవి దాని సహజగుణాలు. ఈ కారణంచేతనే జలం మిగిలిన వస్తువుల్ని పవిత్రం చెయ్యగలుగుతోంది. అలాగే సాధకుడికి కూడా ప్రాణులన్నిటియందు

అవ్యాజమైన ప్రేమ, నిర్మలమైన హృదయము, తీయని మాటలు ఉండాలి. అలా ఉండేవాడు ఇతరులను పవిత్రం చెయ్యగలుగుతాడు.

**5. అగ్ని :** అగ్ని అంటే తేజస్సు. అగ్ని సర్వభక్షకుడు. అయినప్పటికీ ఆయన అపవిత్రుడు కాదు. అలాగే సాధకుడు కూడా జ్ఞాని, తపస్వి, ఇతరులు ఇచ్చేదాన్ని అట్టిపెట్టుకోనివాడు కావాలి. అటువంటి వాడికి భక్ష్యాభక్ష్యాలవల్ల పాపం లేదు.

అగ్నిదేవుడు భక్తులు ఇచ్చే ఆహుతులను తీసుకుంటూ వారి పాపాలను దహించి వేస్తాడు. యోగికూడా అలాగే ఉండాలి. అగ్నియొక్క ఆకారం కట్టెలమీద ఆధారపడి ఉంటుంది. కట్టెలు లావుగా పెద్దవిగా ఉంటే అగ్ని పెద్దగా ఉంటాడు. కట్టెలు తక్కువగా ఉంటే చిన్నగా ఉంటాడు. అలాగే పరమాత్మ కూడా మాయాకల్పితమైన ఈ దేహంలో ప్రవేశించి ఆ దేహంలాగానే కనిపిస్తాడు.

**6. చంద్రుడు :** చంద్రుడికి వృద్ధి క్షయాలు కనిపిస్తాయి. నిజంగా చూసినట్లైతే వృద్ధిక్షయాలనేవి చంద్రకళలకే గాని చంద్రుడికి మాత్రం కాదు. అలాగే వికారాలు ఈ దేహానికేగాని ఆత్మకు కావు.

**7. సూర్యుడు :** సూర్యుడు తన కిరణాలతో భూమిమీద జలాన్ని తీసుకుని, సమయం వచ్చినప్పుడు మళ్ళీ దాన్ని భూమిమీదకే వదులుతాడు. ఆ జలంతో ఆయనకు ఏ అవసరం ఉండదు. అలాగే యోగి కూడా ఇంద్రియాలతో విషయాలను గ్రహించినా కూడా వాటిని వదలివెయ్యాలి. సూర్యుడు ఒక్కడే. కాని మానవులకు ఒకేసారి అనేకచోట్ల కనిపిస్తాడు. అలాగే ఆత్మకూడా ఉపాధిభేదంవల్ల అనేక రకాలుగా కనిపిస్తుంది.

**8. పావురాలు :** ఒక అడవిలో ఒక పావురముండేది. అది చాలా అందంగా, బలంగా చూడటానికి ముచ్చటగా ఉండేది. దానికి ఒక పెంటి పావురంతో జత కలిసింది. ఆ రెండు పావురాలూ చాలా అన్యోన్యంగా ఉండేవి. వాటి శరీరాలు వేరుకాని ప్రాణం ఒక్కటే అన్నట్లుగా ఉండేవి. కొంతకాలానికి పెంటి పావురం గ్రుడ్లు పెట్టింది. ఆ గ్రుడ్లలోంచి పిల్లలు బయట కొచ్చాయి. ఆ పిల్లల పోషణే ఆ పావురాలకి లోకం అయిపోయింది. పిల్లలు క్రమంగా పెరిగి పెద్దవయినాయి. ఒకనాడు పిల్లలకి ఆహారం కోసం పెద్ద పావురాలు రెండూ బయటకి వెళ్ళినాయి. ఆ సమయంలో బోయవాడు చెట్టుక్రింద వల వేశాడు. అందులో చాలా పక్షులు పడ్డాయి. ఈ పావురాల పిల్లలు కూడా చిన్నచిన్నగా నడుస్తూ, మెల్లమెల్లగా ఎగరటానికి ప్రయత్నిస్తూ వెళ్ళి ఆవలలో పడ్డాయి. అందులోంచి బయటకు రాలేక పెద్దగా ఏడుస్తున్నాయి.

పావురాలు తిరిగి వచ్చాయి. పిల్లలు కనిపించలేదు. చుట్టూ వెతికాయి. చెట్టుక్రింద వలలో పడి ఏడుస్తున్నాయి పిల్లలు. ఆ దృశ్యం చూడగానే తల్లి పావురం గుండెలు పగిలి పోయినాయి. దుఃఖం ఆగలేదు. పిల్లలమీద ప్రేమతో ఒక్కసారిగా అదా క్రిందికి దూకేసింది. పిల్లలతో పాటుగా వలలో చిక్కుకుపోయింది. ఈ — చూసిన మగపావురం పరిపరివిధాల చింతించింది. భార్యాపిల్లలు లేని జన్మ ము అని తలచి స్వయంగా బోయవాడి చేతిలో చిక్కి మరణించింది.

మగపావురం కేవలము ఆత్మచింతన లేక అజ్ఞానంతో సంసారమనే బంధంలో చిక్కుకుని మరణించింది. అలాగే అజ్ఞానంతో సంసారబంధనాలలో కూరుకుపోయిన వాడికి శాంతి, సుఖము ఉండవు. కాబట్టి యోగియైనవాడు సంసారబంధనాలలో చిక్కుకుపోరాదు.

**9. అజగరము :** అజగరము అంటే కొండచిలువ. అది ఆహారం కోసం ప్రయత్నించదు. వేటకు పోదు. శరీరబలం ఉండికూడా ఏ ప్రయత్నం చెయ్యదు. నిద్రకూడా పోకుండా అలా చూస్తూ నోటిదగ్గరకు వచ్చిన ఆహారాన్ని తింటుంది. అదే రకంగా యోగికూడా ఆహారం కోసం ఏ ప్రయత్నం చెయ్యకుండా దొరికింది తింటూ, ఎల్లవేళలా ఆత్మనిష్ఠలో గడపాలి.

**10. సముద్రం :** సముద్రం చాలా పెద్దది. అయినా చిన్న ఆకును కూడా తనమీద పడనీయదు. వెంటనే విసిరి బయట పారేస్తుంది. అలాగే యోగికూడా ఏ రకమైన కామాన్ని, వికారాన్నీ తనలో చేరనివ్వరాదు.

సముద్రం బాగా లోతుగా ఉంటుంది. అందులో ఎన్ని జంతువులున్నాయో, రత్నాలున్నాయో మనకి తెలియదు. సముద్రానికి వద్దు లేదు. నదులు వచ్చి తనలో కలిస్తే సముద్రం పెరగదు. నదులు రాకపోతే తరగదు. అలాగే యోగికూడా గంభీరంగా ఉండాలి. తన భావాలను బయటకు తెలియనీయరాదు. తన అంతు ఇతరులకు చిక్కనివ్వరాదు. పరిస్థితులను బట్టి పొంగిపోవటం, క్రుంగిపోవటం కూడదు.

రాజా ! శబ్ద స్పర్శ రూపరసగంధాలనేవి తన్మాత్రలు. వీటినే పంచతన్మాత్రలు అంటారు. వీటికి వశుడైన వాడు జీవితంలో కష్టాలను అనుభవిస్తాడు.

**కురంగ మతంగ పతంగ భృంగమీనాః**

**హతః పంచభిరేవపంచ ॥**

దీనికి ఉదాహరణగా లేడి, ఏనుగు, మిడత, తుమ్మెద, చేపలను చెప్పటం జరిగింది. అవికూడా నాకు గురువులు అయినాయి. వాటిని గురించి చెబుతాను విను.

**11. కురంగము :** కురంగము అంటే లేడి. పరుగెత్తటంలో దీనికి సాటిలేదు. కాని సంగీతం మీద దీనికి మహావ్యామోహం. వేటగాడు అడవికి వచ్చి కొమ్ము బూర ఊదుతూ చక్కని సంగీతం వినిపిస్తాడు. ఆ సంగీతానికి బానిసయైన లేడి పొదలో నుంచి బయటకు వచ్చి సంగీతం వింటూ అలా నిలబడి పోతుంది. అప్పుడు వేటకాడు దాన్ని సంహరిస్తాడు. కాబట్టి అరణ్యాలలో ఉండే యోగి ఇలాటి సంగీతాలకు బానిస కారాదు. దీనికి ఋష్యశృంగుడే చక్కని ఉదాహరణ.

**12. మతంగము :** మతంగము అంటే ఏనుగు. మగ ఏనుగు ఆడు ఏనుగు యొక్క స్పర్శని కోరుతుంది. అందుచేత వేటకాడు ముందుగా ఆడు ఏనుగును పట్టుకుని మచ్చిక చేసుకుని, దాన్ని ఎరగా చూపి మగ ఏనుగును బంధిస్తాడు. కాబట్టి యోగి అయినవాడు స్త్రీ సంపర్కాని కోరరాదు. అది పతనహేతువు. దీనికి ఉదాహరణ విశ్వామిత్రుడు.

**13. పతంగము :** పతంగము అంటే మిడత. నిప్పు మండుతూ ఉంటే, ఆ అగ్నిజ్వాలని చూసి మోహపడి ఏదో చేద్దాము అనుకుని పోయి మంటమీద పడుతుంది. మరుక్షణమే మాడి చస్తుంది. అలాగే పురుషుడు మంచి రూపము, అలంకారాలు చూసి స్త్రీల వెంట పోరాదు. స్త్రీ సాంగత్యము దుఃఖదాయకము.

**14. తేనెటీగ :** తేనెటీగ పూలమీద వాలి, అవి ఏ మాత్రం నలగకుండా వాటిలోని తేనెను గ్రహిస్తుంది. అలాగే యోగి అయినవాడు గృహస్తులను పీడించకుండా భిక్షాటన చెయ్యాలి. తేనెటీగ ప్రతి పుష్పంమీద వాలి, దానిలోని తేనెను గ్రహిస్తుంది. అలాగే యోగి దేన్నీ వదలకుండా సర్వశాస్త్రాలు అధ్యయనం చేసి తద్వారా ఆత్మాన్వేషణ చెయ్యాలి.

**15. మీనము :** మీనము అంటే చేప. జీవికి ఉన్న ఇంద్రియాలలో జిహ్వ చాలా చెడ్డది. దేన్నయినా జయించవచ్చును కాని జిహ్వను జయించటం బహుకష్టం. చేపకు ఏ దోషమూ లేదు. ఒక్క జిహ్వాచాపల్యం తప్ప. అదే దాని పాలిట మృత్యువు అవుతుంది. జాలరివాడు గేలానికి వానపామును గ్రుచ్చి నీటిలో వేస్తాడు. ఆ ఎర

వాసనను బట్టి దాన్ని తిందామని మహదానందంగా వచ్చిన చేప గాలాని తగులుకుని మరణిస్తుంది. కాబట్టి యోగి తనజిహ్వాను జయించకపోతే చేపలాగానే మృత్యువాత పడతాడు.

**16. మధుహారి :** మధుహారి అంటే తేనెతుట్టెలు కొట్టేవాడు. తేనెటీగ ప... పువ్వుకూ తిరిగి, తేనె సంపాదించి తుట్టెలో కూడబెడుతుంది. తేనెతుట్టెలు కొట్టే... ఏదో ఒక ఉపాయంతో ఈగల్ని త్రోలి, అవి కూడబెట్టిన తేనె కాస్తా తీసుకుపోతా... లోకస్వభావం ఇది. మానవుడు తాను తినక ఇతరులకు పెట్టక కూడబెట్టిన ధనం దొంగలపాలో రాజులపాలో అవుతుంది. కాబట్టి యోగి అయినవాడు ధనార్జన చేయరాదు. ధనాన్ని కూడబెట్టరాదు.

**17. వేశ్య :** రాజా ! పూర్వకాలంలో జనకమహారాజు రాజ్యం చేసే రోజులలో పింగళ అని ఒకవేశ్య ఉండేది. దానికి ధనవాంఛ, కామవాంఛ కూడా బాగా ఎక్కువ. ప్రతిరోజూ విటులను పట్టుకుని తన కోరికలు తీర్చుకుంటూ ధనార్జన చేస్తుండేది.

ఒకరోజు సాయంత్రం చీకటి పడగానే ఆవేశ్య అలంకరించుకుని వాకిట్లో నిలబడింది. కాలం గడచిపోతోంది. కాని అదేం చిత్రమో ఆ రోజు ఒక్కడు కూడా రాలేదు. అర్ధరాత్రి దాటింది. ఆ వేశ్యకు విసుగెత్తింది. కామావాంఛ ధనవాంఛ రెండూ పోయినాయి. చిరాకు, కోపం వచ్చినాయి. ఇంతలోనే ఉన్నట్టుండి ఛీ ! కేవలము ఇంద్రియ సుఖం కోసం ఇంత బాధపడాలా? ఇలా ఎదురుచూపులు చూడాలా? అనుకుంది. అంతలోనే ఆ వేశ్య మనసు పరిపరివిధాల పోయింది. సత్యము, నిత్యము, శాశ్వతము అయినవాడు ఆనందాన్నిచ్చేవాడు ఆ పరమేశ్వరుడు కదా ! మరి కేవలము ఒక మానవుడు ఈ శరీరాన్ని పీడిస్తే చాలునని ఎదురుచూస్తున్నాను. ఏమిటి ఈ దౌర్భాగ్యం ? ఈ శరీరాన్ని చూసుకుని ఎంతో ఆనందపడుతున్నాను. అసలు ఇందులో ఏముంది? పైనున్న చర్మం తీసేస్తే ఏం కనిపిస్తుంది? అడుగున రెండు నిట్టాళ్ళలాగా కాళ్ళు, చెరోప్రక్క వసారాకమ్మీలాగా రెండు చేతులు. ఈ రెండింటి మధ్య పెద్దదూలం లాగా వెన్నుపాము. దానికి అటూఇటూ వసారాలాగా ప్రక్కటెముకలు. దీనిమీద రక్తమాంసాలు, మలమూత్రాలు. అవి కనిపించకుండా చర్మము. దానికి తొమ్మిది చిల్లులు. వాటిల్లోనుంచి బయటకు వచ్చేది మలమే. అసహ్యకరమైన ఈ పాడుకొంపకు శరీరము అని పేరు. దానికి సొగసులు. అందచందాలు. ఆభరణాలు. వస్త్రాలంకరణ. ఈ శరీరం కోసమా నేను ఇంతగా

బాధపడుతున్నది. ఈ సుఖాలన్నీ దుఃఖాలకు హేతువులు. శాశ్వతమైన సుఖానిచ్చేవాడు శ్రీమన్నారాయణుడొక్కడే. ఇప్పుడు నాకు జ్ఞానోదయమైంది అంటూ వైరాగ్యభావన అలవరచుకుంది. దాంతో ఆమెకు అద్భుతమైన శాంతి లభించింది. కాబట్టి ఓరాజా! ఆశే దుఃఖము, వైరాగ్యమే పరమసుఖము అని ఆ వేశ్యద్వారా నేను తెలుసుకున్నాను.

**18. లకుముకిపిట్ట :** లకుముకిపిట్ట చాలా చిన్నది. ఒకసారి మాంసపు ముక్క ఒకటి దానికి దొరికింది. ఆ మాంసపు ముక్కని ముక్కున కరచుకుని ఎగిరిపోతోంది ఆ పిట్ట. ఇంతలో ఒక పెద్ద పక్షి అది చూసి ఈ పిట్టమీదకి వచ్చింది. లకుముకిపిట్ట తెలివిగా మాంసపు ముక్కను వదిలేసింది. దాంతో ఆ పెద్ద పక్షి ఈ పిట్టను వదిలి మాంసపుముక్క వెంట పడింది. పిట్టకు గండం తప్పింది. కాబట్టి ఇతరులకు ప్రియమైన వస్తువును మన దగ్గర ఉంచుకుంటే అది మనకు తీవ్రమైన దుఃఖాన్ని కలిగిస్తుంది.

**19. బాలుడు :** ఈ లోకంలో యోగి తరువాత యోగంతటి వారు బాలురే. పసివాడికి భార్యాపుత్రులు, సుఖదుఃఖాలు ఉండవు. ఒకరు తిట్టారని ఉండదు. ఇంకొకరు పెట్టారని ఉండదు. బాలుడు ఎప్పుడూ తనకు తానే ఆడుకుంటూ ఉంటాడు. ఆనందిస్తుంటాడు. కాబట్టి యోగికూడా బాలుడిలాగే ఉండాలి. యోగికీ బాలుడికీ పెద్దగా తేడా ఉండదు. ఇద్దరికీ ఏ రకమైన చింతాలేదు. వెంపర్లాటా లేదు. ఇద్దరూ ఆనంద స్థితిలోనే ఉంటారు. అయితే బాలుడు ఏదీ తెలియకుండా ఉంటాడు. యోగికి అన్నీ తెలుసు.

**20. కన్యక :** ఒక గ్రామంలో ఒక పిల్ల ఉన్నది. దానికి పెళ్ళీడు వచ్చింది. తండ్రి సంబంధాలు చూస్తున్నాడు. ఒకరోజున పిల్లని చూట్టానికి ఎవరో వచ్చారు. సమయానికి తల్లి ఊళ్ళో లేదు. అందుచేత ఆ పిల్లే వడ్లు దంచి అన్నం వండి పెట్టాల్సి వచ్చింది. తనే వడ్లు దంచుతున్నదనే విషయం బయటకి తెలిస్తే బాగుండదు. అందుకని ఎవరూ చూడకుండా చాటుగా వడ్లు దంచుతున్నది. అయితే ఆ పిల్ల చేతులకి ఉన్న గాజులు ఒకటే సవ్వడి చేస్తున్నాయి. అందుకని ఆ చేతికి రెండు, ఈ చేతికి రెండు గాజులు ఉంచి మిగిలినవి తీసివేసి వడ్లు దంచుతోంది. అయినప్పటికీ ధ్వని సన్నగా వస్తూనే ఉంది. ఆ ధ్వనిరావటం కూడా ఆ అమ్మాయికి ఇష్టంలేదు. అందుకని చేతికి ఒక గాజు మాత్రమే ఉంచి వడ్లు దంచసాగింది. ఈ సారి ధ్వని రాలేదు. దీనివల్ల తెలిసింది ఏమంటే చాలామంది కలిసి ఉంటే కలహం వస్తుంది. ఇద్దరు కలిసి ఉంటే ముచ్చట్లు పుడతాయి. అందువల్ల యోగి ఎప్పుడూ ఏకాంతంగానే ఉండాలి.

**21. శరకారుడు :** బాణాలు వేసేవాడి ఏకాగ్రత చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. బాణం వేసేటప్పుడు అతని ఏకాగ్రత ఎంతగా ఉంటుందంటే ప్రక్కన ఏం జరిగినా అతనికి తెలియదు. అతని దృష్టి అంతా లక్ష్యం మీదనే కేంద్రీకృతమై ఉంటుంది.

అలాగే యోగికూడా వైరాగ్యాన్ని అలవరచుకుని, నిశ్చలంగా కూర్చుని ప్రాణాయామం చెయ్యాలి. మనసును పరమేశ్వరుడి మీదనే నిలపాలి.

**22. సర్పము :** సర్పం ఎప్పుడూ వంటరిగానే తిరుగుతుంది. ఏ రకమైన ఏమరుపాటు లేకుండా జాగ్రత్తగా ఉంటుంది. తన ఉనికి ఇతరులకు తెలియనీయదు. రెండు నాలుకలుండి కూడా ఏ పిచ్చి కూతలు కూయదు. ఏ గుహలోనో పడుకుంటుంది.

అలాగే యోగికూడా వంటరిగానే ఏమరుపాటు లేకుండా ఉండాలి. తన ఉనికి ఇతరులకు తెలియనీయరాదు. ఏ రకమైన మాటలూ మాట్లాడరాదు. మాట్లాడగలిగినా మూగవాడిలాగానే ఉండాలి. స్వంతిల్లు అనేది ఉండరాదు. తనది అనేది ఏది ఉన్నా అది దుఃఖహేతువే అవుతుంది.

**23. సాలెపురుగు :** సాలెపురుగు పరబ్రహ్మ తత్త్వాన్ని బోధిస్తున్నది. సృష్టి సంహారాలు జరిగే విధానాన్ని చెబుతున్నది. తన నోటిలో నుంచి దారం తీసి గూడు అల్లి చివరకు దాన్ని తననోటిలోనే లీనం చేసుకుంటుంది. సృష్టిక్రమమంతా ఇలాగే జరుగుతుంది.

**24. భృంగము :** భృంగము అంటే తుమ్మెద. ఇది ఒక పురుగును తెచ్చి అది కదలకుండా పేడలో అంటించి బుర్రుమని రొద చేస్తూ దానిచుట్టూ తిరుగుతుంది. ఆ పురుగు భయంతో తుమ్మెదనే చూస్తూ మనసంతటినీ దానిమీదనే లగ్నం చేస్తుంది. ఇలా చెయ్యటంవల్ల కొంతకాలానికి ఆ పురుగు కూడా తుమ్మెదలా మారిపోయి ఝుంకారం చేస్తూ బయలుదేరుతుంది. కాబట్టి మానవుడు కూడా భయంచేతగాని భక్తిచేతగాని తన మనస్సును దేనిమీద నిలుపుతాడో తానుకూడా అదే రూపం పొందుతాడు. మనసును కేంద్రీకరించినప్పుడు కీటకము యొక్క రూపం మారగా లేంది ఏకాగ్రతతో ధ్యానం చేసేవాడికి ముక్తి లభిస్తుందనటంలో విచిత్రమేముంది?

యదు మహారాజా ! ఈ ఇరవై నాలుగుమందే ఏమిటి? లోకంలో ప్రతి అణువు మనకు గురువే. సమస్త జీవుల్లోను మంచి చెడులను విశ్లేషించేది మనస్సు. కాబట్టి మనస్సే అందరికీ గురువు.

రాజా ! ఈ శరీరమే అన్నింటికన్నా పెద్ద గురువు. ఇది మహా మోసకారి. దీనివల్ల నేను చాలా నేర్చుకున్నాను. ఎన్నిరకాలుగా చూసినప్పటికీ ఈ దేహంవల్ల దుఃఖమే కలుగుతుంది. లోకంలో జనులు ఈ దేహాన్ని అలంకరించాలని ఎన్నో యాతనలు పడుతుంటాడు. ఈ దేహంవల్లనే భార్యాపుత్రులు, మిత్రులు, సిరిసంపదలు, దాసదాసీజనము అన్నింటినీ పెంచుకుంటారు. మరణం లేదు తాను శాశ్వతము అనుకుంటాడు. కాని ఆయువు తీరగానే ఈ శరీరం రాలిపోతుంది. భార్యాపుత్రులు గాని మిగిలిన వారుగాని దీన్ని ఆపలేరు. తాను సంపాదించిన ఇల్లు వాకిలి, ధనధాన్యాలు అన్నీ ఇక్కడే ఉన్నాయి. ఏవీ అతడితో పోవు. మరి దేనికోసం ఇంతకాలం కష్టపడి ఇవన్నీ సంపాదించాడు? రాజా ! ఈ శరీరం దుఃఖహేతువు. శరీరం నశించినా దుః ఖం మాత్రం నశించదు. మళ్ళీ ఇంకొక శరీరాన్ని తయారుచేసి దానికి ఈ దుఃఖ మంతా అంటిస్తుంది. దీనికి అంతం లేదు. చెట్టుక్రింద విత్తనాలు రాలి మళ్ళీ మొక్కలు మొలుస్తాయి. అలాంటిదే ఈ దేహవ్యవహారం కూడా.

దేహంవల్ల దేహి పడే దుఃఖం చెప్పతరం కాదు. ఒక ప్రక్క నాలుక, ఇంకో ప్రక్క ముక్కు, వేరొక ప్రక్క కన్ను, అన్నింటికన్నా మించి 'ఉపస్థ', ఇవన్నీ చాలక కోటానుకోట్ల ఆశలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు. ఇవన్నీ పీక్కు తింటాయి మానవుణ్ణి. అందుకే మోక్షగామికి దేహం మీద ఆశ పనికిరాదు. ఈ లోకంలో కనిపించే ప్రతి అణువూ మనకు గురువే. ఈ గురువులవద్ద విజ్ఞానాన్ని ఆర్జించి, అహంకార మమకారాలు వదలి, విరాగియై, ఆత్మనిష్ఠుడై, నిస్సంగంగా తిరుగుతూ జీవాత్మను పరమత్మలో లీనం చెయ్యాలి" అంటూ గురుతత్త్వాన్ని ఉపదేశించాడు దత్తాత్రేయుడు.

హైహయవంశంలో పుట్టిన కృతవీర్యుని కుమారుడు కార్తవీర్యుడు. ఇతను పుడుతూనే చొట్టచేతులతో పుట్టాడు. అతడికి వేయిచేతులు ప్రసాదించాడు స్వామి. అంతేకాక అష్టసిద్ధుల్ని, అద్భుత పరాక్రమాన్నీ ప్రసాదించి చివరకు మోక్షాన్ని కూడా అనుగ్రహించాడు. అలాగే అలర్క చక్రవర్తికి ముక్తిని ప్రసాదించాడు. విష్ణుదత్తుడనే బ్రాహ్మణునికి అష్టసిద్ధులు ఇచ్చి లోకోపకారం చేయించాడు. ప్రహ్లాదుడికి ఆత్మతత్త్వాన్ని ఉపదేశించాడు. యదు మహారాజుకు జ్ఞానబోధ చేశాడు. ధర్మకీర్తి అనే మహారాజు మొదట్లో స్వామిని ఆశ్రయించి చివరకు తిరస్కరించినా, అతనికి తెలియకుండానే అతన్ని కాపాడి మరుజన్మలో ముక్తి మార్గం చూపాడు. సహ్యాద్రి మీద ఉండి తనను

ఆశ్రయించిన పరశురాముడికి ముక్తిమార్గం చూపాడు దత్తాత్రేయుడు. ఆ సమయంలో పరశురాముడికి స్వామి చేసిన బోధే "త్రిపురారహస్యదీపిక" అనే పేరుతో నేను ప్రచురించిన పుస్తకము, సి.డి. కూడా.

ఇలా అనంత కరుణాసముద్రుడై భక్తులను రక్షించే శాశ్వతానందమే దత్తాత్రేయుడు. తరువాత కాలంలో శ్రీపాదవల్లభుడిగా నృసింహ సరస్వతిగా అవతరించాడు స్వామి. అన్నింటికీ మించి గురుసంప్రదాయానికి నాంది పలికినవాడు దత్తాత్రేయుడు. అందుకే ఆయనకు **"గురుమార్గ ప్రవర్తకుడు"** అని పేరు.

## 8. గురుగీత

స్కాందపురాణంలోని ఉత్తరఖండంలో ఉమామహేశ్వర సంవాదంగా ఉంది గురుగీత. ఇది మొత్తం 142 శ్లోకాలలో ఉంది. మొదటి శ్లోకంలో శౌనకాది మహర్షులు "ఓ సూతమహర్షీ రహస్యాతి రహస్యమైన గురుగీతను వినాలని ఉన్నది. కాబట్టి మా యందు దయ ఉంచి ఆ గురుగీతను తెలియజెయ్యవలసినది" అని అడుగుతారు. ఇక్కడ రహస్యమంటే ఎవరికీ చెప్పకూడనిది అని కాదు.

**నదేయం పరశిష్యేభ్యోనాస్తి కేస్యోనచేశ్వరీ ।**
**నసుశ్రూషాలసానాంచ నైవా నర్థప్రదాయినః ॥**

తన శిష్యులు కాని వారికి చెప్పరాదు. ఇతర సాంప్రదాయాలలో ఉండే వారికి, నాస్తికులకు చెప్పరాదు. అర్థాన్ని తెలుసుకోలేని అజ్ఞానులకు చెప్పరాదు. తెలుసుకోవాలని కోరిక ఉన్నవారికి, దానిమీద నమ్మకం ఉన్నవారికి మాత్రమే చెప్పాలి అని అర్థం.

ఆ మాటలు విన్న సూతమహర్షి చెప్పటం మొదలుపెట్టాడు. "మహర్షులారా ! కైలాసంలో ఒకనాడు పార్వతీదేవి తన భర్త అయిన ఈశ్వరుడికి నమస్కరించి "దేవదేవా! పరాత్పరా ! జగద్గురూ ! నీకు నమస్కారం చేస్తున్నాను. నాకు గురుదీక్షని అనుగ్రహించవలసినది. సదాశివా ! నీవు సర్వధర్మాలు తెలిసినవాడివి. అందరికీ సుఖాన్నిచ్చేవాడివి. అందుచేత అంతులేని కృపతో నాకు గురుతత్త్వాన్ని బోధించు. స్వామీ దేహాన్ని ధరించిన మానవుడు బ్రహ్మమయుడు కాగల మార్గమేది? ఈ దేహంలో పడ్డ జీవుడు తాను ఈ దేహాన్నే అనుకుంటున్నాడు. అందువల్లనే ఇన్ని చిక్కులు వచ్చిపడ్డాయి. ఈ జీవి పరమాత్మలో లీనమయ్యే మార్గం ఏది? ఈశ్వరా ! ఈ జీవికి ముక్తిని ప్రసాదించు. దయచేసి గురుతత్త్వాన్ని ఉపదేశించు" అని ప్రార్థించింది.

ఆ మాటలు విన్న ఈశ్వరుడు "ఓ పార్వతీ ! ఇంతవరకు ఎవ్వరూ నన్నిలా ప్రశ్నించలేదు. నీ మీద ప్రేమతో గురుతత్త్వాన్ని నీకు అనుగ్రహిస్తున్నాను వినవలసినది" అంటూ గురుగీతను చెప్పటం ప్రారంభించాడు.

"ఓ పార్వతీ ! గురువంటే మామూలు మనిషి కాదు.

**యోగురుస్సశివః ప్రోక్తో యశ్శివ స్సగురుస్స్మృతః ।**
**వికల్పం యస్తు కుర్వీత సభవేత్ పాతకీ గురౌ ॥**

ఎవడు గురువో అతడే శివుడు. ఎవడు శివుడో అతడే గురువు. అంటే శివుడే గురువు గురువే శివుడు ఇదే వేదాలలోను, పురాణాలలోను కూడా చెప్పిన విషయం. ఈ విషయం తెలియక ఇద్దరూ అంటే గురువు శివుడు వేరు వేరు అనుకునేవారు మహాపాతకులు. ఇక్కడ శివుడు అంటే త్రిమూర్తులలో మూడవవాడు అనికాదు. శివుడు అంటే సాక్షాత్తు పరమేశ్వరుడు అని అర్ధం. గురువుకూడా మనలాగే తింటున్నాడు. మనలాగే తిరుగుతున్నాడు. కాబట్టి మనలాంటివాడే అనుకోరాదు. గురువు సాక్షాత్తు పరబ్రహ్మ. అంతకన్న వేరైనది లేనేలేదు.

వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, మంత్ర తంత్రాది విద్యలు అన్నీ అల్పబుద్ధులైన వారిని భ్రమలో పడేసేవే. యజ్ఞయాగాదులు, వ్రతాలు, తీర్థయాత్రలు జపము, తపములాంటి సాధన మార్గాలు కూడా ఉత్తమోసకారులే. ఓ పార్వతీ ! గురుతత్త్వాన్ని గనక తెలుసుకోకపోయినట్లైతే మనం చేసే జపతపాలు, యాత్రలు, యజ్ఞయాగాలు అన్నీ నిరర్ధకమే. గురుతత్త్వం మీద దృష్టి లేకపోతే అన్ని విద్యలు అజ్ఞానంలోకి దారి తీస్తాయి. వీటి మోజులో పడేవారు తెలివితక్కువవారు. అవన్నీ అపరవిద్యలు. వాటివల్ల లౌకిక సుఖం తప్ప మోక్షం రాదు. అందుకే సద్గురువును అన్వేషించాలి. సద్గురువు అంటే ఎవరు ? అతని లక్షణాలు ఏవి ?

జ్ఞానస్వరూపుడైన గురువుకన్నా వేరే వస్తువు ఏదీలేదు కాబట్టి బుద్ధిమంతుడు ఆ గురుతత్త్వాన్ని గ్రహించేందుకు ప్రయత్నించాలి. మాయయే ఈ జగత్తుగా మారింది. అదే అవిద్య. ఆ అవిద్యను పోగొట్టగలవాడే గురువు.

**యదంఘ్రి కమల ద్వంద్వం ద్వంద్వతాప నివారకమ్ ।**
**తారకంభ సింధోశ్చ తం గురుం ప్రణమామ్యహమ్ ॥**

ఎవని పాదపద్మాలు సుఖదుఃఖాలు, శీతోష్ణాలవల్ల కలిగే తాపాలను పోగొడతాయో, ఎవని పాదపద్మాలు సంసారమనే సాగరాన్ని దాటించగలుగుతాయో, అటువంటి గురువుకు నమస్కారము.

గురువుగారి పాదాలనాశ్రయించి సేవించటంవల్ల వాడి పాపాలు నశించిపోతాయి. మనస్సు పరిశుద్ధమవుతుంది. అప్పుడు సాధకుడు కూడా పరబ్రహ్మ అవుతాడు. కాబట్టి సాధకుడు ముక్తి పొందాలంటే గురుపాద సేవనమే పరమోపాయము. అయితే గురుపాద సేవన ఎలా చెయ్యాలి? దానివల్ల ఫలితం ఏమిటి? అనే విషయాలు చెబుతాను విను.

**గురోః పాదోదకం పీత్వా ధృత్వా శిరసి పావనమ్ ।**
**సర్వతీర్థా ఉవగాహస్య సంప్రాప్నోతి ఫలంనరః ॥**

గురువుయొక్క పాదాలు కడిగి ఆ నీరు శిరస్సున జల్లుకున్నా త్రాగినా సర్వ తీర్థాలలోను స్నానం చేసిన ఫలం వస్తుంది.

**శోషణం పాపపంకస్య దీపనం జ్ఞాన తేజసః ।**
**గురోః పాదోదకం దేవి సంసారార్ణవ తారకమ్ ॥**

ఓ దేవీ ! గురుపాదోదకము పాపము అనే బురదను ఎండగడుతుంది. జ్ఞానజ్యోతిని వెలిగిస్తుంది. సంసారమనే సముద్రాన్ని దాటిస్తుంది.

**అవిద్యా మూలనాశాయ జన్మకర్మ నివృత్తయే ।**
**జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్ ॥**

అవిద్య, అజ్ఞానము పూర్తిగా నశించాలన్నా, పూర్వజన్మలలో చేసిన పాపం క్షయం కావాలన్నా, జ్ఞానవైరాగ్యాలు సిద్ధించాలన్నా గురుపాదోదకాన్ని సేవించాలి.

**గురుపాదోదకం పానం గురోరుచ్ఛిష్ట భోజనం ।**
**గురుమూర్తే స్సదాధ్యానం గురుస్తోత్రం పరోజపః ॥**

కేవలము గురుపాదోదకం పానం చేసినంతమాత్రంచేత చాలదు. గురోరుచ్ఛిష్ట భోజనం గురువుగారు తిని వదలిన దాన్ని నువ్వు తినాలి. అంటే భావనామయంగా అన్నపానాలను గురుప్రసాదంగా నిత్యం భావించాలి. సర్వకాల సర్వావస్థలలోనూ గురువునే ధ్యానించాలి. గురుస్తోత్రమే ఉత్తమ జపంగా ఆచరించాలి. గురునామాన్ని

కీర్తించటం అంటే అనంతరూపుడైన శివనామ సంకీర్తనమన్న మాట. గురు రూపాన్ని ధ్యానించటమంటే ఆ శివుణ్ణి ధ్యానించటమే. అటువంటి గురువు గొప్పదనం ఏమిటి? గురువు సామాన్యుడు కాదని గతంలో చెప్పుకున్నాం. ఇప్పుడంటున్నారు సర్వశ్రేష్ఠములయిన ఎవరి పాదరేణువులు సంసారమనే మహాసముద్రానికి వంతెన నిర్మించటానికి సరిపోతాయో, అటువంటి గురువుకు నమస్కారము. గురువు నివసించిన చోటే కాశీక్షేత్రము. వారి పాదోదకమే గంగ. సంసార సాగరాన్ని దాటించే ఆ విశ్వేశ్వరుడే నీ గురువు. గురుపాద ముద్రలు పడినచోటే విష్ణుపాదాంకితమైన గయ. అదే ప్రయాగ. సర్వకాల సర్వావస్థలయందు అటువంటి గురువును గనక ధ్యానించినట్లైతే, ఆయన ఆజ్ఞను పాలించినట్లైతే, ఆయన అనుగ్రహం మనకు లభిస్తుంది. అందుకే గురువుకు సర్వస్వాన్నీ అర్పించాలి.

**స్వాశ్రమంచ స్వజాతించ స్వకీర్తిం పుష్టివర్ధనమ్ ।**
**ఏతత్సర్వం పరిత్యజ్య గురుమేవ సమాశ్రయేత్ ॥**

తన జాతి కులము మతము ఆశ్రమము ధనము ధాన్యము కీర్తి వీటన్నింటినీ వదలివేసి గురుమూర్తిని ఆశ్రయించాలి. ఇతర చింతనలు ఏవీలేక సర్వదా ఆ గురువునే ధ్యానించాలి. అటువంటి వారికి నిశ్చయంగా పరమపదం లభిస్తుంది. కాబట్టి సర్వకాల సర్వావస్థలయందు గురుమంత్రాన్ని ధ్యానం చెయ్యాలి.

**గుకారశ్చాంధకారోహి రుకారస్తేజ ఉచ్యతే ।**
**అజ్ఞానగ్రాసకం బ్రహ్మ గురురేవ న సంశయః ॥**

'గు' అంటే చీకటి 'రు' అంటే వెలుతురు. అజ్ఞానము అనే చీకటిని మ్రింగి వేసే తేజస్సు గురువే అనటంలో సందేహం లేదు.

'గు' అంటే చీకటి. 'రు' అంటే దాన్ని పోగొట్టేది. చీకటిని పారద్రోలుతాడు కాబట్టి అతడికి గురువు అని పేరు వచ్చింది. చీకటి అంటే పాపం. శిష్యుని యొక్క పాపాన్ని హరిస్తాడు కాబట్టి గురువు అనబడ్డాడు.

**గుకారస్స్యాద్గుణాతీతో రూపాతీతో రుకారకః ।**
**గుణరూప విహీనత్వాత్ గురురిత్యభిధీయతే ॥**

'గు' అంటే గుణాతీతుడు. 'రు' అంటే రూపాతీతుడు. గుణానికి రూపానికి అతీతుడు. ఆ రెండూ లేనివాడు కనుకనే గురువనబడుతున్నాడు. గురు అనే రెండు

అక్షరాలలోనూ మొదటిదయిన గుకారము మాయవల్ల జనించే త్రిగుణాలను చెబుతుంది. రుకారము మాయవల్ల కలిగే భ్రమలను పోగొట్టే పరబ్రహ్మను చెబుతుంది.

**ఏవం గురుపదం శ్రేష్ఠం దేవానామపి దుర్లభమ్ ।**
**హాహా హూహూ గుణైశ్చైవ గంధర్వైరపి పూజితమ్ ॥**
**ధ్రువం తేషాం చ సర్వేషాం నాస్తి తత్త్వం గురోఃపరమ్ ॥**

గురువు అనే పదం చాలా శ్రేష్ఠమైనది. ఇది దేవతలకు కూడా దుర్లభము. హాహా హూహూ అనే దేవగాయకులైన గంధర్వులుకూడా దీన్ని అధికంగా గౌరవిస్తారు. వారికి కూడా గురువుకన్న శ్రేష్ఠమైన తత్త్వం వేరొకటి లేదు.

కాబట్టి గురువుని సేవించాలి. గురువుని ఆరాధించాలి. తన జీవితాన్నే నివేదనగా అర్పించాలి. 'నేను జీవుణ్ణి' అనే భావన ఆయనకు వదలి 'నేను సచ్చిదానందమూర్తిని' అనే స్థితిలో ఉండాలి. ఇది పరిపూర్ణమైన నివేదన.

**ఆసనం శయనం వస్త్రం వాహనం భూషణాదికమ్ ।**
**సాధకేన ప్రదాతవ్యం గురోస్సంతోషకారణమ్ ॥**

ఆసనాలు మంచాలు వస్త్రాలు వాహనాలు ఆభరణాలు ఈ రకంగా గురువుకు సంతోషం కలిగించే వస్తువులన్నీ ఆయనకు సమర్పించాలి. గురువుకు నమస్కరించేటప్పుడు చుట్టూ ఎంతమంది ఉన్నా సరే సిగ్గు బిడియం అభిమానం అన్నీ వదిలేసి గురువును ఆరాధించాలి. సాష్టాంగ దండప్రణామాలు అర్పించాలి. శరీరాన్ని, ధన మానప్రాణాలను గురువుకు నివేదించాలి.

**గురురేవ జగత్సర్వం బ్రహ్మ విష్ణు శివాత్మకమ్ ।**
**గురోః పరతరం నాస్తి తస్మా త్సం పూజయేద్గురుమ్ ॥**

త్రిమూర్తి స్వరూపమైన ఈ జగత్తంతా గురువే. గురువుకన్న వేరు ఏదీలేదు. శ్రేష్ఠమైనది ఏదీలేదు. అందుచేతనే గురువును పూజించాలి.

ఎవరి అనుగ్రహంచేత సాధకుడి హృదయంలో జ్ఞానము, ఆనందము ఆవిర్భవిస్తాయో అతడే గురువు. ఎవరిని దర్శించినంత మాత్రంచేత నీకు శాంతి లభిస్తుందో, ఎవరి దగ్గర నీ ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయో, ఎవరి దగ్గర నీ మనస్సు తేలిక అవుతుందో, ఎవరి దగ్గర నీకు జ్ఞానం లభిస్తుందో అతడే నీకు

గురువు. అందుకే సంసారము అనే చెట్టు ఎక్కి నరకము అనే సముద్రంలో పడబోతున్న లోకాలను రక్షించేవాడే గురువు. అటువంటి గురువుకు నమస్కారము.

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**
**గురురేవ పరంబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః ॥**

గురువే బ్రహ్మ గురువే విష్ణువు గురువే ఈశ్వరుడు. అతడే సాక్షాత్తు పరబ్రహ్మ. అట్టి గురువుకు నమస్కారము.

**అఖండ మండలాకారమ్ వ్యాప్తం యేన చరాచరమ్ ।**
**తత్పదం దర్శితం యేన తస్మైశ్రీ గురవే నమః ॥**

చరాచర జగత్తు అంతా వ్యాపించిన ఆ పరబ్రహ్మను నాకు దర్శింపచేసిన గురువుకు నమస్కారము. 'తత్త్వమసి' అనే మహావాక్యానికి "నీవే ఆ పరబ్రహ్మవు" అనే అర్థం చెప్పిన గురుమూర్తికి నమస్కారము. తత్ త్వం అనే వస్తువులు రెండఊచీ వేరుకావు. ఆ రెండూ ఒకే పరమాత్మను బోధిస్తాయి అనే జ్ఞానాన్ని వివరించిన గురువుకు నమస్కారము. ఉపనిషత్తులచే తెలియబడువాడు, వేదాంతములు అనే పద్మాలకు సూర్యునివంటివాడు అయిన గురువుకు నమస్కారము

**చైతన్యం శాశ్వతం శాంతం మాయాతీతం నిరంజనమ్ ।**
**నాదబిందు కళాతీతం తస్మైశ్రీ గురవే నమః ॥**

చైతన్య వస్తువు ఆద్యంతములు లేనిది, శాంతమైనది, మాయాతీతమైనది. నాదబిందు కళలకు అతీతమైనది. అటువంటి చైతన్యరూపుడైన గురువుకు నమస్కారము. స్థావరజంగమాత్మకమైన జగత్తు అంతటా ఎవని చైతన్యము వ్యాపించి ఉన్నదో అట్టి గురువుకు నమస్కారము. నీవే నా తండ్రివి, నా తల్లివి, నా దేవతవు. ఓ గురుదేవా! ఈ సంసారం మీదగల ప్రీతిని పోగొట్టు. ఈ జగత్తంతా నీవు వ్యాపించి ఉండటంవల్లనే జగత్తు ఉన్నదానిలా ఉన్నది. నీ తేజస్సు వ్యాపించటంవల్లనే జగత్తు కాంతివంతంగా ఉన్నది. నీ ఆనందం వ్యాపించటంవల్లనే జగత్తు సుఖంగా ఉన్నది. గురుదేవా! నీవు మనస్సులో చేరి చలనం కలిగించటంవల్లనే మానవుడు జాగ్రత్స్వప్న సుషుప్తులలో చైతన్యవంతుడై ఉన్నాడు. నీ గురించిన జ్ఞానం కలిగితే బేధబుద్ధి పోయి ఈ జగత్తు కనిపించదు. కేవలము పరమాత్మ రూపమైన నీవే దర్శనమిస్తావు. నీవే కార్యకారణ

రూపాలుగా కనిపిస్తున్నావు. అంటే మాయ నువ్వే, జగత్తు నువ్వే. కాని నిజానికి నువ్వు ఈ రెండింటికీ అతీతుడివి. జ్ఞానరూపివి నీవు. శక్తిరూపివి నీవు. భుక్తిముక్తి ప్రదాతవు నీవు. జ్ఞానమనే అగ్నిచేత శిష్యులకు అనేక జన్మలనుంచి వచ్చిన కోట్లాది కర్మలను దహించి వేసేవాడివి నువ్వు. నిన్ను మించిన తత్త్వం లేదు. తపస్సు లేదు. జ్ఞానం లేదు. గురువే అన్నింటికీ ఆది అనాది. గురువే పరదేవత. గురువుకు సాటి ఎవరూ లేరు. విషమ పరిస్థితులు వచ్చినప్పుడు నిజమైన బంధువు గురువొక్కడే. ఆయన కోరికలు లేనివాడు. కరుణాసముద్రుడు. ఈ విశ్వమంతా గురువులోనే ఉన్నది. విశ్వమంతటిలోనూ గురువున్నాడు. ఆయన జగత్స్వరూపుడు. రూపరహితుడు. సంసారమనే అరణ్యంలో ప్రవేశించి దిక్కు తెలియకుండా పోయినవాళ్ళకు మంచి దారి చూపేవాడు గురువు. తాపత్రయాగ్నికి కాగి అలసిపోయిన ప్రాణులకు గురువే శ్రేష్ఠమైన గంగ. లోకాలన్నింటికీ కారణమైనవాడు; సంసార సాగరాన్ని దాటించే సేతువు, సర్వవిద్యలకు ప్రభువు గురువు. గురురూపం ధ్యానానికి ఆధారం. గురుపాదుక పూజకు ఆధారం. గురువాక్యం మంత్రానికి ఆధారం. అందుకే గురువందనం చెయ్యాలి. గురువును పూజించాలి.

**శివేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే న కశ్చన ।**
**తస్మాత్ పరగురుం లబ్ధ్వా తమేవ శరణం వ్రజేత్ ॥**

భగవంతుడు కోపిస్తే గురువు రక్షిస్తాడు. కాని గురువు కోపిస్తే రక్షించేవాడు లేడు. కాబట్టి సద్గురువును ఆశ్రయించాలి. శరణు వేడాలి.

ఓ పార్వతీ ! గురువు మూడు కళ్ళు లేని శివుడు. నాలుగు చేతులు లేని విష్ణువు. నాలుగు శిరస్సులు లేని బ్రహ్మ. నిత్యుడు, నిరాకారుడు, నిర్వికారుడు, యోగి, దోషరహితుడు, నిష్కళంకుడు, నిష్కాముడు అయిన గురువుకు నమస్కారము. శిష్యులయొక్క హృదయములు అనే పద్మాలకు సూర్యునివంటివాడు, సత్యరూపుడు, జ్ఞానస్వరూపుడు, ఉపనిషత్తులచేత మాత్రమే తెలియదగినవాడు, మంగళప్రదుడు గురువు. ఉపాయము తానే, ఆ ఉపాయంచేత పొందదగినదీ తానే అయి ఉండి శిష్యుడికి మంచి ఉపాయం చూపేవాడు గురువు. కార్యము కారణము రెండూ తానే అయినవాడు, సాకారుడు, నిరాకారుడు, ఊహించనలవి కాని స్వరూపం గలవాడు. చూచేవాడు, చూడబడేది, చూపుకూడా తానే. గుణాలకు ఆధారమైనవాడు, గుణాలు

కలవాడు, గుణాలు లేనివాడు తానే. జన్మ ఎత్తినవాడూ తానే, జన్మరహితుడు తానే. ఆదిమధ్యాంతములు లేనివాడు. మాయకు అతీతుడు. మాయను తన అధీనంలో ఉంచుకున్నవాడు, సర్వ యంత్ర మంత్ర తంత్ర స్వరూపి అయిన గురుమూర్తికి నమస్కారము. సాక్షాత్తు ఆ పరమేశ్వరుడే మానవదేహంలోకి వచ్చి గురువు అనే పేరు ధరించి ఈ భూమిమీద రహస్యంగా తిరుగుతుంటాడు. అయితే పుణ్యాత్ములకు శివుడుగాను, పాపాత్ములకు మనిషిగాను కనిపిస్తాడు.

మనం గురువుకు నమస్కరించేటప్పుడు ఆయన పాదాలకే ప్రధానంగా నమస్కరించాలి. గురువుయొక్క పాదాల జంట ఎటువైపు ఉంటుందో, ఆ దిక్కుకు ప్రతిరోజూ నమస్కరించాలి. గురువు శ్రీనాథుడు. అంటే ఆయన విష్ణుస్వరూపుడు. లక్ష్మీప్రదుడు. మంగళరూపుడు. శుద్ధచైతన్య స్వరూపుడు. మరి ఆయన పాదాలు ఏవైపుకు ఉంటాయి అంటే, ఆయన శుద్ధ చైతన్యస్వరూపుడు అంటే పరబ్రహ్మ కాబట్టి ఆయన పాదాలు 6దిక్కులకు ఉంటాయి. గురువుకు నమస్కరించేటప్పుడు మనస్సు నిర్మలం చేసుకుని నమస్కరించాలి. ఇక నమస్కారం ఏ విధంగా చెయ్యాలి అంటే సాష్టాంగ నమస్కారం చెయ్యాలి. ఎనిమిది అవయవాలతో నమస్కారం చెయ్యాలి. ఏమిటి ఆ ఎనిమిది అవయవాలు. 1. రొమ్ము, 2. శిరస్సు, 3. మనస్సు, 4. మాట, 5. చూపు, 6. కాళ్ళు, 7. చేతులు, 8. చెవులు. వీటన్నింటినీ నేలకు ఆన్చి అప్పుడు గురువుకు నమస్కరించాలి. ఆ సమయంలో మనసును కేవలము గురువుగారి మీదనే లగ్నం చేసి నమస్కారం చెయ్యాలి.

గురువును ఉపాసించటమనేది భూలోకంలోనే కాదు దేవలోకంలో కూడా అత్యంత ప్రధానమైనది. గురుకృపవల్లనే బ్రహ్మ సృష్టి చేస్తున్నాడు. విష్ణువు లోకాలను పోషిస్తున్నాడు. రుద్రుడు లయం చేస్తున్నాడు. ఈ రకంగా త్రిమూర్తులు వారి వారి పనులలో కృతకృత్యులయినారు. అందుకే గురుసేవ చేసి ఆయన యొక్క కృపకు పాత్రులు కావాలి. గురుశుశ్రూష చేసే విధానం అత్యంత రహస్యమైనది. దేవగంధర్వ యక్షకిన్నెర కింపురుష సిద్ధసాధ్య గణాలు కూడా దీన్నెరగవు. దీనికి కారణమేమంటే, తపస్సువల్ల విద్యవల్ల బలంవల్ల మదించి అహంకరించేవారు ఏతాములో ఉన్న కడవలాగా సంసారమనే సుడిగుండంలో పడిపోతారు. ఏతాము అంటే బావిలో నుంచి నీళ్ళు తోడటానికి ఉపయోగించే సాధనం. దీనికి వరుసగా కడవలుంటాయి. అవి బావిలో నుంచి నీటిని తీసుకుని పైకి వచ్చి, మళ్ళీ ఆ బావిలోనే పడిపోతాయి.

ఈ కడవ బావిలో నుంచి పైకి వచ్చి ఆగదు. మళ్ళీ క్రిందకి పడిపోతుంది. అలాగే తపస్సు విద్యలవల్ల అహంకరించేవారు తాము ఉద్ధరింపబడినట్లే కనిపిస్తారు కాని మళ్ళీ అజ్ఞానంలోకి జారిపోతారు. సంసారబంధనాలలో చిక్కిపోతారు. అందుకే సర్వసౌఖ్యకరము, భుక్తిముక్తిప్రదము అయిన గురుధ్యానం త్రికరణశుద్ధిగా చెయ్యాలి.

శ్రీమత్పరబ్రహ్మ గురుం స్మరామి
శ్రీమత్పరబ్రహ్మ గురుంభజామి ।
శ్రీమత్పరబ్రహ్మ గురుం వదామి
శ్రీమత్పరబ్రహ్మ గురుం నమామి ॥

పరబ్రహ్మ స్వరూపుడైన గురువును స్మరిస్తున్నాను. భజిస్తున్నాను. ఆయనను కీర్తిస్తున్నాను. అట్టి గురువుకు నమస్కరిస్తున్నాను.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్వమస్యాది లక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతమ్
భావీతం త్రిగుణ రహితం సద్గురుం తం నమామి ॥

బ్రహ్మానందస్వరూపుడు, పరమసుఖప్రదుడు, శుద్ధ జ్ఞానస్వరూపుడు, ద్వంద్వాతీతుడు, ఆకాశము వంటివాడు, తత్వమసి మొదలైన మహావాక్యాలకు తాత్పర్యమైనవాడు, రెండవది లేనివాడు, నిత్యుడు, నిర్మలుడు, నిశ్చలుడు అందరి బుద్ధికీ సాక్షి, బుద్ధికి అందనివాడు, గుణాలు లేనివాడు అయిన గురువుకు నమస్కారము.

ఆనందమానందకరం ప్రసన్నం జ్ఞానస్వరూపం నిజబోధయుక్తం ।
యోగీంద్ర మీడ్యం భవరోగవైద్యం శ్రీమద్గురుం నిత్యమహం నమామి॥

ఆనందస్వరూపుడు, ఆనందాన్ని ఇచ్చేవాడు, అనుగ్రహం కలవాడు, జ్ఞానరూపుడు, ఆత్మజ్ఞాని, యోగిశ్రేష్ఠుడు, స్తుతి చేయదగినవాడు, సంసారమనే రోగానికి వైద్యుడు అయిన గురుమూర్తికి నిత్యము నమస్కరిస్తున్నాను.

నిత్యం శుద్ధం నిరాభాసం నిరాకారం నిరంజనమ్ ।
నిత్యబోధ చిదానందం గురుంబ్రహ్మ నమామ్యహమ్ ॥

నిత్యుడు, పరిశుద్ధుడు, నిర్వికారుడు, నిర్మలుడు, నిత్యస్వరూపుడు, జ్ఞానస్వరూపుడు, చైతన్య స్వరూపుడు, ఆనందస్వరూపుడు పరబ్రహ్మ అయిన గురువుకు నమస్కారము.

మనం ధ్యానం చేసేటప్పుడు గురువు హృదయ పద్మంలో కర్ణికమీద ఉన్న సింహాసనంలో కూర్చుని, దివ్యమైన రూపంతో, చంద్రరేఖలాగా ప్రకాశిస్తూ 'సచ్చిదానందము' అనే వరాన్ని ఇచ్చేవాడుగా భావించి ధ్యానించాలి.

ఆయన ఆత్మరూపుడు కాబట్టి తెల్లనిగంధము పూసుకుని, తెల్లని పూలమాలలు ధరించి, ముత్యాల ఆభరణాలతో, తన యెడమ తొడమీద దివ్యమైన శక్తి కూర్చుని ఉండగా, కృపాసముద్రుడై ప్రకాశించే గురువును ధ్యానించాలి. సృష్టి స్థితి లయాలు, నిగ్రహానుగ్రహాలు అనే అయిదు పనులు నిత్యము ఎవనియందు ప్రకాశిస్తుంటాయో, ఆ గురువును సేవించాలి.

**న గురోరధికం న గురోరధికం న గురోరధికం న గురోరధికం ।**
**శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనతః ॥**

గురువుకన్న అధికమైనది ఏదీ లేదు. ముమ్మాటికీ ఏదీలేదు. ఇది శివశాసనము. ఇది ధ్యానమార్గం. ఇక జ్ఞానయోగ మార్గాలలో గురూపాసన చేసే విధానం చూద్దాం.

పరిశుద్ధమైన జ్ఞానయోగంలో, జ్ఞేయమైనది అంటే తెలియబడేది అంతా తగులబెట్టి, చివరకు ఆ చిన్మాత్రలో తన జ్ఞాతృత్వాన్ని తగలబెట్టాలి. అంతకన్న వేరేదారి లేదు. అయితే ఎంతకాలం ఈ ఉపాసన చెయ్యాలి ? అనే ప్రశ్న వస్తుంది. అదే చెబుతున్నారిక్కడ. ఈ దేహం ఉన్నంతవరకు గురుధ్యానం చెయ్యాల్సిందే. పరమశ్రేష్ఠమైన అద్వైత నిష్ఠలో ఉన్నా కూడా గురుధ్యానం చెయ్యాల్సిందే. మరి నిత్య వ్యవహారంలో నడచుకోవలసిన విధానం ఏమిటి? అంటే శిష్యుడు ఎప్పుడూ గురువుమీద పెత్తనం చెయ్యరాదు. కోపగించరాదు. ఆయన సమక్షంలో అబద్ధం ఆడరాదు. గురువును ఏకవచనంలో సంబోధించినా, గురువుమీద హుంకారాలు చేసినా, వాదన చేసి గురువును మించాలని చూసినా నీళ్ళులేని ఘోరారణ్యంలో బ్రహ్మరాక్షసియై పుడతాడు. గురువుగారి వస్తువులు ఏవీ తీసుకోరాదు. కేవలము ప్రసాదం మాత్రమే తీసుకోవాలి.

గురువు వాడుకునే పాదుకలు, ఆసనాలు, మంచాలు మొదలైన వాటికి నమస్కారం చెయ్యాలి. వాటిని తూష్ణీభావంతో చూడరాదు. గురువు నడిచేటప్పుడు ఆయన వెనకే నడవాలి. ఆయన్ను దాటిపోరాదు. ఆయన దగ్గర ఆడంబరాలు ప్రదర్శించరాదు. ఆభరణాలు ధరించరాదు. గురునింద చెయ్యరాదు. ఎవరైనా మన గురువును

నిందిస్తుంటే దాన్ని ఆపుచెయ్యాలి. అలా చేతకాకపోతే మనం అక్కడ నుంచి వెళ్ళిపోవాలి. అలా కాకుండా గురునింద విని సహించిన వాడికి నాలుక కోసుకోవటమే ప్రాయశ్చిత్తము. గురువుగారి సమక్షంలో ఉన్నప్పుడు ఆయనకు ఇష్టంలేని హాస్యం చెయ్యరాదు. అధిక ప్రసంగం చెయ్యరాదు. గురువాజ్ఞను గౌరవంతో పాటించాలి. గురువు కావాలనే తప్పులు చేస్తాడు. లేదా చేస్తున్నట్టు కనిపిస్తాడు. వాటిని సరిదిద్దాలని చూడరాదు. గుర్వాజ్ఞ మీరరాదు. గురుభావాన్ని మించి మాట్లాడరాదు. ఈ రకంగా ప్రవర్తించేవారికి అపారమైన గురుకృప లభిస్తుంది.

ఈశ్వరుడు ఇంతవరకు గురు ఉపాసనా విధానాన్ని చెప్పి ఇక గురుఉపాసన వల్ల వచ్చే ఫలితాలను చెబుతున్నాడు. ఓ పార్వతీ ! గురువు విషజంతువుల బారినుండి, మహర్షుల శాపాలబారి నుండి, చివరకు కాలమృత్యువు నుండి కూడ తన శిష్యుణ్ణి రక్షిస్తాడు. పరబ్రహ్మను సాక్షాత్కరింప చేసుకున్నవాడు గురువు. కాబట్టి ఒక దీపం ఇంకొక దీపాన్ని వెలిగించినట్లుగా పరబ్రహ్మతత్త్వాన్ని తన శిష్యుడికి అందిస్తాడు.

గురుకృపా లబ్ధమైన ఉపదేశంతో "నేనే బ్రహ్మను" అనే భావన చెయ్యాలి. ఇదే ముక్తికి మార్గం. చరాచర జగత్తులోని అన్ని వస్తువులయందు, అన్ని ప్రాణులయందు పరమాత్మ స్వరూపుడైన గురువునే దర్శించాలి. ముందుగా గురుధ్యానం చేసి, తరువాత మిగిలిన పని చెయ్యాలి. పరాత్పరుడు, పరిశుద్ధుడు అయిన గురువును హృదయాకాశంలో అంగుష్టమాత్రంగా భావించి ధ్యానించాలి. అలా ధ్యానం చేస్తే నిర్మలము, పరమాకాశ స్వరూపము, నాశరహితము, శాశ్వతము, అగమ్యము, అగోచరము, నామాతీతము, రూపాతీతము, ఆనందమయము అయిన పరబ్రహ్మను నేనే అనే జ్ఞానం కలుగుతుంది. ఈ రకంగా గురువును ధ్యానించటంవల్ల కీటకము భ్రమరమైనట్లుగా సాధకుడు తానే పరబ్రహ్మ అవుతాడు. "నేను అద్వితీయమైన పరబ్రహ్మను" ఇది గురువాక్యము" అని నిత్యము భావించేవాడు తపస్సు కోసం అరణ్యాలకు పోవలసిన అవసరం లేదు. ఈ రకంగా సాధన చెయ్యటంవల్ల సాధకుడు ఒక్క క్షణంలోనే సమాధిస్థితి పొందగలడు. అతడు కోట్లాదిజన్మలలో చేసిన పాపాలు ఆ క్షణంలోనే నశిస్తాయి. వైరాగ్యము, నిత్య తృప్తి గలిగినవాడు పొందే సుఖం దేవేంద్రుడు కూడా పొందలేడు. అటువంటి సాధకుడి ముందు దేవేంద్రుడు కూడా ఎందుకూ కొరగాడు. అటువంటివాడున్న దేశం పవిత్రమవుతుంది. అక్కడి జనులు కూడా పవిత్రులవుతారు." అంటూ గురుగీతను పూర్తిచేశాడు ఈశ్వరుడు.

ఇంతవరకు అత్యంత భక్తిశ్రద్ధలతో గురుతత్త్వాన్ని పూర్తిగా విన్నటువంటి మీ అందరి మీద గురుకృపాకటాక్ష వీక్షణాలు ప్రసరించాలని, మీకందరికీ సర్వశుభాలు కలగాలనీ ఆకాంక్షిస్తూ

హరితసగోత్రీకుడు శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మ

శ్రీ కృష్ణమూర్తిగార్ల జ్యేష్ఠపుత్రుడు

పరమానందనాథ దీక్షానామధేయుడు అయిన **క్రోవి పార్థసారథి**

సర్వజనామోదముగా సులభశైలిలో వ్రాసిన **'గురుతత్త్వము'** అనే గ్రంథము

సమాప్తము. సర్వేజనాః సుఖినోభవంతు సమస్త సన్మంగళానిభవంతు

ఓం తత్సత్

## 9. శ్రీ గురుపాదుకా పంచకమ్

ఓం నమో గురుభ్యో గురుపాదుకాభ్యాం నమః పరేభ్యః పరపాదుకాభ్యాం
ఆచార్యసిద్ధేశ్వర పాదుకాభ్యాం నమోనమః శ్రీ గురుపాదుకాభ్యాం ॥ 1

ఐంకార హ్రీంకార రహస్యయుక్తా శ్రీంకార గూఢార్థ మహావిభూత్యా ।
ఓంకార మర్మ ప్రతిపాదినిభ్యాం నమోనమః శ్రీ గురుపాదుకాభ్యామ్ ॥ 2

హోత్రాగ్ని హోత్రాగ్ని హవిష్య హోతృ హోమాది సర్వాకృతి భాసమానమ్ ।
యద్బ్రహ్మ తద్బోధ వితరిణీభ్యామ్ నమోనమః శ్రీ గురుపాదుకాభ్యామ్ ॥ 3

కామాది సర్పవ్రజ గారుడాభ్యామ్ వివేక వైరాగ్య నిధి ప్రదాభ్యామ్ ।
బోధః ప్రదాభ్యాం ద్రుత మోక్షదాభ్యామ్ నమోనమః శ్రీగురుపాదుకాభ్యామ్॥

అనన్త సంసార సముద్ర తారా నౌకాయితాభ్యాం స్థిర భక్తిదాభ్యాం ।
జాడ్యాబ్ధి సంశోషణ వాడ్వాభ్యామ్ నమోనమః శ్రీ గురుపాదుకాభ్యాం ॥ 5

ఇతి శ్రీ గురుపాదుకా పంచకమ్ సమాప్తమ్